దాకా ఎవరి పట్టింపులు వారివే! ఎవరిచోట వారే! ఇది విరహవిప్రలంభదశ. నాయకుడు పలవరించేవాడు-"యాడుంటివే యెంకి యాడుంటివే" అని. ఆమె తలుకు జ్ఞాపకంవస్తే అతని తల తిరిగిపోయేది. మామిడిపండు తింటే విషమై పోయేది. విరహతీవ్రత భరించలేక నాయకునికి కినుక కలిగేది.

'రావొద్దె నా పక్క రావొద్దె యెంకీ!
ఆ పొద్దె మన పొత్తులయిపోయె నెంకీ!"

అంటూ ఆకాశభాషణం చేసేవాడు. తోటలోనికి వెళ్ళినా అదే కలత.

"తోట వూసంటే సికాకూ,
యెంకి
తోటి యెల్లే దాని సోకూ!"

అంటూ నిట్టూర్పులెగజిమ్మేవాడు. ఒక్కొక్కమాటు యెంకిమీద కోపంతో నాయుడుబావ ఎక్కడికో వెళ్ళిపోయేవాడు.

"ఎన్నాడిసి పెట్టెల్లినాడే,
నా రాజు,
మొన్నె తిరగొస్తనన్నాడే!!!"

అంటూ ఆక్రందించేది యెంకి దురంతనిరీక్షణలో.

"అనాటి నావోడు సెందురూడా,
అలిగి రాలేదోయి సెందురూడా"

అని తమ సంయోగదశలో సాక్షీభూతుడుగా ఉన్న చందురునితో మొరపెట్టుకునేది.

"ఈ రేయి నన్నొల్లనేరవా? రాజా
ఎన్నెలల సొగసంత యేటిపాలేనటర!"

అంటూ ఏటిగట్టున నిలిచి, నాటి స్మృతుల తలపులు తెరచి, విప్రలబ్ధగా విహ్వలించేది. చివరికి ఎంతకూ తన బావ తిరిగిరాకపోయేసరికి

"దూరాన నా రాజు కే రాయిడౌనో!
ఈ రోజు నా రాత లే రాలపాలో!"

అని కీడు శంకించేది కూడా.

పూర్ణయోగం :

ఉత్తముల కోపం క్షణకాలం. ఉదాత్త సంస్కారాన్ని పంచుకున్న దంపతుల పొరపొచ్చాలు కూడా స్వల్పకాలికాలే. తాత్కాలికమైన ఉద్రేకానికి లోనై యెంకి పుట్టింటికెళ్ళినా, నాయుడుబావ ఎక్కడికో వెళ్ళినా ఇద్దరిమధ్య కాలం మంచుతెరలు కప్పినా వారి అంతరంగాలలో స్థిరంగా చిరంగా ఉన్న అనురాగరశ్మి అమ్లానంగానే ఉండేది. మళ్ళీ కలుసుకున్నప్పుడు పెల్లుబికేది 'రవలవెలుగుల గంగ'లా. ఆ అనురాగధారలో స్నాతులై పునీతులై యెంకీనాయుడు బావలు నిర్వికారస్థాయి నందుకున్నారు. ఈ సమున్నతికి, ఈ పూర్ణయోగ స్థితికి— "యెనకజల్మకములోన యెవరమోనంటి" అనేపాట పతాకసదృశం. ఈ పాటలో త్రికాలాల్లోనూ మూడుజన్మల్లోనూ యెంకీ నాయుడుబావల అవిభాజ్య యోగం ధ్వనిస్తున్నది. 'ఆరిపేయవె దీపమూ' అనే పాటలో నాయకుని ఇంద్రియాతీతసౌందర్యదృక్పథం తత్త్వనిశ్రేణి నధిగమించింది.

"'ఎంకెవ్వ' రని లోక
మెపుడైన కదిపితే
వెలుగునీడల వైపు
వేలు సూపింతు!"

వంటి పంక్తుల్లో ప్రాకృతిక ధర్మం పారమార్థిక స్థాయి నందుకున్నది.

"'పగలు రే లెడబా లెరుగ రెవ్వరోయీ'?
'శంకరుడు సతి యచట, యిం కెవ్వ రిచట!'"

ఈ పంక్తులు యెంకీ నాయుడుబావల దాంపత్యజీవనం సాధించిన అద్వైతసిద్ధికి ప్రతిబింబాలుగా నిలిచిపోయినవి.

భావచిత్రాలు :

యెంకి పాటలనిండా ముఖ్యంగా పాట పాటల్లో అంతటా పరుచుకొని ఉన్నవి మాండలికపదాలూ తప్పితే భావచిత్రాలు. కనిపించే దృశ్యాలను మాటల్లో బొమ్మగీసి చూపడం ఒక ప్రతిభ. కనిపించని రూపాలను పదాలతో పట్టివ్వడం అసాధారణ ప్రతిభ. అలాంటి ప్రతిభతో దిద్దిన భావచిత్రాలు కొన్ని టిని పరిశీలిద్దాం.

(1) "కస్సుమంటా యేరు గాలి నెగబోసింది"

ఏటిలో జోరుగా సాగే సరవ విసురుతో గాలి హోరుమంటున్నది, ఏరే

గాలిని తూర్పారబట్టినట్లుగా ఉన్నది. అగుపించిన గాలికి కవికుంచె దించిన భావచిత్ర మిది.

(2) "గాలికైనా తాను కవుగిలీనన్నాడు"
నాయకుని ఉత్తమ శీలాన్ని పరమ వ్యంగ్యంగా రూపొందించిన ప్రకటన మిది.

(3) "పూ లెరుగు నా కోత నీలెరుగు నా మోత"
నాయిక హృదయం సుమసుకుమారమైనది; నీటివలె సుతిమెత్తనిది. ఆమె గుండెకోత ఆ పూలకే తెలుసు. ఆమె ఎదలో కల్లోలం ఆ నీటికే తెలుసు.

(4) "ఏటి కడుపున దాగి తోట నిదుగోయింది"
ఒక నిశ్చల ఛాయాచిత్రాన్ని (Still Photograph) అత్యంత సహజంగా తీసిన పదచిత్రమిది.

(5) "ఆకాశ మా వరస ఆవులించిన రేయి,
ఎలుతు రంతా మేసి ఏరు నెమరేసింది"

వంటి భావచిత్రాలు పిశ్వకవితా భాండాగారంలో అగ్రపంక్తిలో నిలువ దగిన నిధులు.

యెంకిపాటల్లోని భావచిత్రాలన్నీ దాదాపుగా నండూరివారి మౌలిక ప్రతిభలోనుండి ఉద్భవించినవే. 'ఉయ్యాల' అనే గీతంలో మాత్రం ఒక చరణంపైన సంప్రదాయ సంస్కార ముద్ర స్పష్టంగా భాసిస్తున్నది. ఏటి ప్రక్కన ఉన్న చెట్టుకొమ్మకు ఉయ్యాల కట్టుకొని యెంకి ఊగుతున్నది, ఏటి నీటిలో ప్రతిఫలించిన చంద్రవంక బొమ్మ ఉయ్యాల ఊగుతున్నది. ఈ దృశ్యాన్ని చిత్రీకరిస్తున్నాడు కవి.

"తీగల నడుమ నూగె
దీపమై తిలకమై
పీఠమై-ఎంకికి-కి
రీటమై నెలవంక"

ఈ చలద్భావ చిత్రంపైన భాగవతంలోని 'రవిబింబం బుపమింప' అనే పద్యప్రభావం ఉన్నట్టు తోస్తున్నది. వామనుని త్రివిక్రమత్వాన్ని సూచించడానికి సూర్యబింబాన్ని కొలమానంగా తీసుకున్నాడు పోతన్న. మొదట ఛత్రంలా

వామనుని శిరస్సుపై నిలిచిన ఇనబింబం క్రమంగా శిరోరత్నంగా, శ్రవణాలంక్రియగా, కేయూరంగా, కంకణంగా పర్యవసించి, చివరికి పదపీఠిగా నిలిచిపోతుంది. ఈ 'ఉయ్యాల' పాటలో కొమ్మఉయ్యాల ఊగుతున్న యెంకికి నెలవంక దీపంలా, నుదుటి తిలకంలా, పీఠంలా, చివరకి తలపైని కిరీటంలా పరిఢవిల్లింది. ప్రాచీన కావ్యాభ్యాస సంస్కార ఫలితంగా నండూరివారి గొంతునుండి పునరవతరించిన భావనారమ్య చిత్ర మిది.

## యెంకి పాటలు-మాండలిక పదాలు:

ముత్యాలసరాలద్వారా గురజాడ అప్పారావుగారు శిష్టవ్యావహారిక భాషను కావ్యోపయోగిగా తీర్చిదిద్దడం ఆనాటి గొప్ప ప్రయోగం. ఆ తర్వాత బసవరాజు అప్పారావుగారు ఆ దారిలో నడిచిన వారిలో పరిగణ్యులు. శిష్టవ్యావహారికంతో ఆగిపోక ఇంకొక్క అడుగు ముందేసి మాండలిక భాషలో సముదాత్త భావాలను సమర్థంగా అందించిన ప్రయోగశీలి నండూరి సుబ్బారావుగారు. మామూలుగా పాటకజనం మాట్లాడుకునే మాటల్లో ఎంత పాటవం ఉందో రుజువు చేశారు నండూరివారు. యెంకిపాటల్లో ఉన్న మాండలిక పదాలు ప్రాయికంగా గోదావరి, విశాఖమండలాలకు సంబంధించినవే. మచ్చుకు కొన్ని-

(1) కూసింత సేపు:- కాసంత సేపు కా సేపు అనడానికి వాడుకలో ఉన్న తూర్పుయాస ఇది.

(2) ఉసురోసుకుంది:- ప్రాణం తీసేసింది అనే అర్థంలో వాడే మాట ఇది. తెలంగాణంలో ఉసురుపోసుకుంది అనే ప్రయోగం ఉంది.

(3) అగ్గిసూస్తాది:- కసిరిచూస్తుంది అనే అర్థంలో; ఇది విశాఖప్రాంతం వాడుక.

(4) దగ్గరస:- గోదావరి వాడుక. దగ్గరగా అనే అర్థంలో.

(5) పల్లకుందామంటె:- ఊరుకుందామంటె అనే అర్థంలో- బహుశః పలకకుందామంటె దీనిమూలమై ఉంటుంది.

(6) కొంగట్టుకు:- కొంగుపట్టుకొని. గోదావరి విశాఖ మండలాల వాడుక, ఇందులోని పకారలోపం తెలంగాణంలోనూ అక్కడక్కడా ఉంది. మూడొద్దులు-మూడు రోజులనడానికి. పొద్దులులోని పకారం లోపించి ఏర్పడిన పదబంధ మిది.

(7) పద్దాక:- చాలసేవు. తెలంగాణంలో ఇది పొద్దనుక అనే రూపంలో ఉంది.
(8) తలతిరిగిందోలె:- ఇందులోని ఓలె అంటే ఓసి. 'రావే ఓలె' ఇది తూర్పు ప్రయోగం.

ఇంకా బేగి (వేగంగా), బుటకలు (మునకలు), ఆపడితే (అగపడితే), కొత్తి (పొయ్యి) లాంటి మాండలిక పదాలు అసంఖ్యాకంగా ఉన్నవి. వీటిని ప్రయోగించడం విశేషం కాదు. ఆ ప్రయోగం రససిద్ధికి దోహదం చేయడం. ఏమాత్రం చతికిలబడకుండా కండగల శిష్టపదజాలంతో దీటుగా జంగలు సాచి నడవడం.

## కొత్త పాటలు-గొంతు మార్పు :

1925 లో పాతపాటల ప్రచురణ జరిగింది. 1926 లో నండూరివారు ఏలూరులో న్యాయవాద వృత్తిలో చేరారు.'ప్లీడరీకి కవిత్వానికి సగమెరుక సుమీ!' అని హెచ్చరించారు మిత్రులు. పాటల నడక ఆగిపోలేదు కాని కాస్త మందగించింది. 1948 లో నండూరివారికి ప్రముఖ వైణిక గాయకులు మంచాళ జగన్నాధరావు గారి స్నేహం లభించింది. మంచాళవారు వీణపై క్షేత్రయ్య పదాలను పాడి వినిపిస్తుంటే పరవశించి వినేవారు నండూరివారు. వారిలో సుప్తంగా ఉన్న సృజనశక్తి పొరలెత్తి మేలుకుంది. గళగ్రంధి విడిపోయి మళ్ళీ పుంస్కోకిల కూజితాల జల్లులు కురిపించడం మొదలయింది. జగన్నాధరావుగారు ధన్యాసి రాగంలో ''చల్లనాయె శేరా నామనసెంతో'' అనే క్షేత్రయ్య పదం వినిపించగా ఆ రాగప్రభావంతో 'దీపసుందరి' వెలువడింది. ఇలాగే కొత్త పాటల్లోని చాలా పాటలు జగన్నాధరావుగారి వీణాగానంతో ఉద్బుద్ధమైనవే. క్రమంగా నండూరి వారిపై విలంబకాల సంగీత ప్రభావం సాంద్రంగా పడింది. దానితో స్వరం మారింది, పదం మారింది, పాట తీరు మారింది. పాత పాటల్లోని 'యెంకి' కొత్త పాటల్లో 'ఎంకి' అయింది. 'యెలుగు' వెలుగు అయింది. 'సెట్టు' చెట్టుగా, 'సేను' చేనుగా 'సెందురుడు' 'రేరేడుగా' రూపొందినాయి. పోను పోను-

''సాగరుని సల్లాపమా అల
చందురుని యుల్లాసమా సిక
తాతలాడ విలాసమా
ఆ పగిది బంధించు నీ కనుపాప నెయ్యది తాపసీ?''

వంటి భావకవితాప్రౌఢపదముద్రలున్న గీతం మిశ్రగతిలో వెలువడింది.

యెంకిపాటల్లో ఉన్న మాత్రాచ్ఛందోగతులు నూటికి తొంభైయైదు పాళ్లు ఖండగతిలో నడచినవే. అయితే జానపదం నుంచి జ్ఞానపథంలోకి జరిగిన ఈ పయనంలో ఇదే క్రమమని ఖచ్చితంగా గీటుగీసి చెప్పలేము. కొత్తపాటల్లో స్థూలంగా శైలీ బాణీ మారినా 'ఈ రేయి నన్నొల్ల నేరవా', 'లేపకే నాయెంకి లేపకే నిదర', 'ఇంతేనటే సంద్ర మెంతేనొ అనుకొంటి' వంటి జానపద పరిమళమున్న పాటలూ లేకపోలేదు.

## యెంకి పాటల ప్రశస్తి :

సుమారు నాలుగు దశాబ్దాలుగా నండూరి సుబ్బారావుగారు ఏది పలికినా యెంకి మాటగా, ఏది పాడినా యెంకి పాటగా జీవించారు. తమ రాగజీవనాన్నీ కవితాప్రవృత్తినీ యెంకితో తాదాత్మ్యం చేసుకున్నారు. ఇంటింటా యెంకి పేరు పెట్టుకుంటారని తమ కృతిసాఫల్యాన్ని భావించుకున్నారు. 'వుత్తమాటలు నీవి వొమ్మ'ని యెంకి కొత్త పాటలు పాడుకొమ్మన్నా — ఆ కొత్తపాటల్లోనూ యెంకే సాక్షాత్కరించింది. కాశీవిశ్వేశ్వరుడు కుడా తల తడుముకొని తబ్బిబ్బుపడేట్టుగా రసాకృతియై తేజోమూర్తియై నిలబడింది యెంకి. అందుకే నండూరివారే అన్నారు–

''యీ చిత్తముకు వెలుగు నీ యెంకితనమే'' అని.

యెంకిపాటలుకాక నండూరివారు వ్రాసిన ఏకైక గీతం 'తల్లీ మా కస్తూరిబా.' 1923లో గాంధీగారు కాకినాడకు వచ్చినపుడు వ్రాసిన పాట ఇది. ఇది ఇప్పుడు లభ్యం కావడం లేదని వారి కుమారులు బాలసూర్యారావుగారు నాతో అన్నారు. నండూరివారి అభిమాన గీతాలు మూడని కూడా వారు చెప్పారు. ఒకటి– 'వుత్తమాటలు నీవి,' రెండవది–'పంటసేలకే పయనం;' మూడవది– 'సన్నిడిసిపెట్టెల్లినాడే.'

తొలినాళ్లలో యెంకిపాటలపైన రేగిన గాలిదుమారం ఇంతా అంతా కాదు. ప్రతి ప్రయోగశీలికి పట్టిన అవస్థే ఈ పాటలకూ పట్టింది. చేవ ఉన్న ప్రతి నవ్య ప్రయోగం చివరికి జైత్రయాత్ర సాగించినట్లే యెంకిపాటలు కూడా తెలుగునాట శైశవావస్థనాటి జైత్రయాత్రను సాగించాయి. ఆరోజుల్లోనే ప్రముఖ విద్వాంసులు ఈ పాటలను ప్రశంసించారు.

"యెంకి నాయుడుబావలు కేవలం జీవేశ్వరులే" – అని అన్నారు పురాణం సూరి శాస్త్రిగారు.

శృంగార రసాధిష్ఠాన దేవతలగు రతీమన్మథులే వీరని అన్నారు పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు.

రంభానలకూబరులు అలంకారశాస్త్ర విరుద్ధంగా శృంగార సల్లాపంచేసిన దోషం వలన కలియుగంలో యెంకీ నాయుడుబావలుగా జన్మించా రని చమత్కరించారు వేదం వేంకటరాయశాస్త్రిగారు.

"పండితు లెవరో కాదనుట విని గుణము లేనిదే వారు కా దనరే? యని యెంచి ఈ కవికుమారుని ఇచ్చటికి ఆహ్వానించితిని" అని రెడ్డిమహాసభలకు నండూరివారిని ఆహ్వానించి సత్కరించారు కట్టమంచి రామలింగారెడ్డిగారు.

'ఎంకి' నాపే రితని
కేమిలేదట వీని
నెవ రెరుగ రంటా!'
'నామకానామకులు నటనె నేడంతా'
'ప్రకృతి సుందరిజంట పరునకెటులంట!' (నటీనటులు)

పాటను లక్ష్యంగా ఉదాహరించారు వేదాల-తిరువేంగళాచార్యులుగారు ఆంధ్ర ధ్వన్యాలోకంలో.

ఇంకా గిడుగు, వేటూరి, మల్లంపల్లి, కోలవెన్ను, ఖూర్గుల వంటివారు ఈ పాటలను వ్యాసరూపకంగా ప్రశంసించారు.

ఆకాశవాణిద్వారా, సాహిత్యసభలద్వారా, లలిత సంగీత కార్యక్రమాల ద్వారా ఈ పాటలు బహుళప్రచారం పొందినవి.

యెంకి పాటలరూపంలో ఒక సరికొత్త గేయ సంప్రదాయాన్ని, యెంకి ద్వారా వినూతన శృంగార నాయికను తెలుగుకావ్యజగతికి అందించిన నండూరి సుబ్బారావుగారు తరువాతి తరాలకు అనుకరణీయులైనారు. అందరికీ అందు బాటులోనే ఉన్నా ఎవ్వరికీ అందకుండానే ఉన్నారు.

———

# ఆరుద్ర

## డా॥ శ్రీమతి నాయని కృష్ణకుమారి

సమకాలిక కవిత్వాన్ని గురించి వ్యాఖ్యానం చేయడం అంత సులువైన పనేమీకాదు- ఇందులో ఎన్నో భేదాలున్నాయి- కవిత్వ రీతుల్ని ఆశ్రయించుకున్న భేదాలు కొన్ని. వస్తువును ఆశ్రయించుకుని కొన్ని. కవిత్వానికి రాజకీయ ప్రయోజనమో, సాంఘిక దృక్పథమో ఉండాలని కొందరు వాదిస్తే, ఇవన్నీ ఉన్నా లేకపోయినా, కవితను తీర్చిదిద్దే శిల్పాన్ని నిర్లక్ష్యం చేయకూడదనీ, అది హృదయ సంబంధ మైనదనీ, అదే లేకపోతే కవిత్వమనేది ఏదోరకపు ప్రచారవాఙ్మయ మౌతుందేతప్ప కవిత్వమనిపించుకోదనీ వాదించేవారు కొందరు. కవితను ప్రచార సాధనంగా వాడు కుంటున్నప్పుడైనా సరే, అది ఒక ఇజాన్ని ప్రచారం చేయకుండా, కేవలం బుద్ధి ననుసరించి స్వేచ్ఛగా నిర్నిబంధంగా (Uncommitted intellectual trend) ఉండాలని వాదించేవారు కొందరు. ఈ నాటికి, కవిత్వం కేవలం రసానంద కారకం మాత్రమే అనే భావాన్ని పూర్తిగా వదిలేసినా, ఏదో ఒక ఇజానికి కట్టుబడి రచనలు చేసి తీరాలనే వాదం కూడా పూర్తిగా వెనక బట్టినట్లే. అనగా నిబద్ధ ఆదర్శ వాదిత్వం (committed Ideological trend)అంతగా ఇప్పుడు కనిపించదు. అభ్యుదయ కవిత్వం ఆవిర్భవించిన తొలిరోజుల్లో, అనగా శ్రీ శ్రీ మహాప్రస్థాన శంఖారావాన్ని పూరించినప్పుడు, తెలుగులోని నవ్య కవిత్వ ప్రేరకులూ, పోషకులూ, అభిమానులూ అందరూ, మార్క్సిజంపట్ల ఆకర్షితులై, మార్క్సిస్టు సిద్ధాంతాలు తడవని కవిత్వమేదీ అభ్యుదయ కవిత్వం కావడానికి వీలే లేదు పొమ్మన్నారు. అంత వీరనిష్ఠంగా ప్రారంభమైన అభ్యుదయ కవిత్వంలో కొంతకాలం తర్వాత ఎన్నో మార్పులు వచ్చాయి. సాహిత్యం సాంఘిక జీవితాన్ని మార్చడానికి మాత్రమే కాక ఉన్న జీవితాన్ని ఉన్నట్లుగా కళ్ళకు కట్టిస్తే మాత్రం అదెంత కాదు అనే ధోరణి ప్రబలమైంది. మార్క్సిజం స్థానంలో మెల్లమెల్లగా వాస్తవ వాద దృష్టి (Realistic approach) మానవతా వాద దృష్టి, (Human approach) చోటు చేసుకో నారంభించాయి- కేవలం వర చైత

న్యాన్ని గురించి పాడితేనే తప్ప మిగతాది కవిత్వం కాదేమోననే కట్టుబాటు సడలి పోయింది- ఇందులోకి ఎన్నో నవ్య ప్రయోగాలు, ప్రయోగ వైశిష్ట్యం దృష్ట్యా ప్రవేశించాయి.- మళ్ళీఇక్కడ చెప్పే విషయం మీద గాఢ నిష్ఠకంటే చెప్పే పద్ధతి మీద శ్రద్ధా ప్రత్యయమూ ఎక్కువయ్యాయి- ఇదంతా గమనించి, చిరాకెత్తిపోయి, అభ్యుదయ కవిత్వం ఇంకెందుకూ పనికి రాదంటూ, విప్లవ కవులు బయలుదేరారు. జాతి జీవితంలో ప్రధానాంగమే రాజకీయం. జాతిని ఉత్తే జకం చేయవలసింది సాహిత్యం. ఈ రెంటికీ విడరాని బంధం ఉండ వలసిందే నన్నారు. "ప్రజల్ని సాయుధుల్ని చేసే రివల్యూషనరీ నేటికవి"- అని నిర్వ చన మిచ్చుకున్నారు. పీడితుల్ని, తిరగబడే వార్ని, పోరాడే వార్ని తమ ప్రజలుగా వీళ్ళు ఎన్నుకొన్నారు. వాళ్ళకోసమే మేము కలాన్ని ఆయుధంగా చేపడుతున్నా మన్నారు- అందుకని, మాది సాయుధ కవితోద్యమమని సగ ర్వంగా చెప్పుకున్నారు.

ఈనాటి వరకూ సాగివస్తున్న ఇటువంటి నవ్య సాహిత్య చరిత్రలో, ఆరుద్ర స్థానమేమిటి? తన కవిత్వ పాథేయంతో, ఈ నిరంతర ప్రయాణీకుడు సాహిత్య ప్రస్థానంలో ఎక్కడ ఒదుగుతాడు? పుట్టుకతో కవితా బీజా నను సంతరించుకున్న ఆరుద్ర వాటికి చేసిన దోహద విశేషాలేమి, తీర్చిదిద్దిన ఆకార మెటువంటిది? ఈ నాటికి ఆరుద్ర ఇంకా కవిగా మిగిలే ఉన్నాడా? ఇవన్నీ ప్రశ్నలు. 1925లో పుట్టిన ఆరుద్ర చాలా చిన్న వయస్సులోనే కలం పట్టి కాగితాల మీద కవితాక్షరాలను చెక్కడం ఆరంభించాడనాలి 1942లో అంటే కవికి 17 సంవత్సరాలప్పుడు, ఆరుద్ర అంతకు ముందు ఏది వ్రాసినా మెచ్చుకోని శ్రీ శ్రీ, 'లోహ విహంగాలు' అనే గీతం విని, "అబ్బ! పెడదారి వదిలేసి ఎడద దారి ఎక్కావ్. గుడ్! ఇదీ నీ రస్తా, ఊ, సాగిపో" అన్నా డట. అంతకు ముందు నాలుగేళ్ళనుండి నాలో ఎంబ్రియో స్థితిలో ఉన్న నిండు కవిత ప్రభవించి పురిటికేక వేసిందని అప్పటికి నాకు తెలిసింది, అని చెప్పు కున్నాడు ఆరుద్ర.

తనేం చెప్పుకున్నా ఆరుద్ర కవిత్వాన్ని విశ్లేషించి చూస్తే, కొన్ని లక్ష ణాలు స్పష్టంగా మనకు దర్శన మిస్తాయి. అవి: (1) కవి, సంప్రదాయమంటే ఇష్టం కలవాడే, మాతృదేశం మీద భక్తి ఉన్నవాడు-

ఆయన కవిత ప్రారంభించిన తొలిదశలో రూపొందించిన ఖండికల్లో ఈ

విషయాలు స్పష్టమౌతాయి. గాయాలూ-గేయాలూ అనే కావ్యంలో, చేర్చిన ఖండికలన్నీ, పత్రికల్లో అచ్చయినవీ, రేడియోల్లో పాడినవీ సినిమాలకు వ్రాసినవీ. విశాలాంధ్ర రాష్ట్రావతరణం వలన కలిగిన ఆనందాన్ని సూచిస్తూ విజయీభవ విజయీభవ విశాలాంధ్ర జననీ అని కీర్తించాడు. ప్రజలంతా సుఖాలతో బ్రతుకంతా మనసీ అని ఆకాంక్షించాడు. నీ పేరును ప్రపంచాన నిలిపెదమో అమ్మా, మా రాష్ట్రము దేశానికి తలమానికమమ్మా అంటు వైభవగానం చేశాడు. వేదంలా ప్రవహించే గోదావరీ, వెన్నెల వంటి కృష్ణవేణి తుత్తూరా మాదిరి నాదంతో తుంగభద్రా సన్నాయికి మల్లే పెన్నానదీ ఈ రాష్ట్రావతరణ శోభలో వైవాహిక దీప్తిని నింపాయన్నాడు.

తెలుగు పాటకు నేడు కొత్తపల్లవి పాడు, తెలుగు వాకిట కొత్త రంగ వల్లిక చూడు అని వివశుడవుతూ, భావావేగంతో, తెలుగు కోడళ్ళు కుందనపు చేతులకు గోరింట గోళ్ళతో వీణెలు మీటుతారనీ, తెలుగు జవరాళ్ళు అమృతపు జల్లుతో పెదవి విప్పకనే పాడతారనీ కాల్పనికతకు దారులు వెదుక్కున్నాడు.

ఇవ్వాళ సంక్రాంతీ కాదు, దీపావళీ కాదు. ఎందుకిన్ని వేడుకలు? రేయంతా ఇన్ని దీపాలు! తెలుగు కన్నెల కళ్ళ కాటుక రేకలు, కాళ్ళ పారాణి, మొగలి పువ్వుల వాల్జడ పరిమళాలు ఈ సంబరమంతా ఏ పర్వదినమని? అంటూ పరవశించిపోతూ,

"జాజర పాటలు పాడుతు నీకు జాతర చేస్తామో తల్లీ,
బాజా భజంత్రీలు మోగగా నీ బావుటా ఎగరవేస్తా మళ్ళీ"

అని తన్మయత్వాన్ని భజిస్తున్నాడు. ఇక్కడ మనకు కనిపించే ఆరుద్ర మార్క్సిజాన్ని కవిత్వంలో చాటిచెప్పాలనే ఆరుద్ర కాడు. అందువల్లనే ఈ ఆరుద్ర దేశనాయకులైన గాంధీ నెహ్రూలను కూడా కీర్తించ గలిగాడు. అమరజీవి పొట్టి శ్రీరాములను అగ్గించాడు. ఇక్కడ మార్క్సిస్టు ఆరుద్ర లేడు. సిసలైన సంప్రదాయ వాది ఆరుద్రే మనకు కనిపించేది- దేశభక్తిగల ఆరుద్రే మనకు దర్శన మిచ్చేది.

1962 లో చైనాతో మన దేశం యుద్ధం చేయవలసి వచ్చినప్పుడు, దేశ భక్తిని చాటుకునే కవిత్వం చాలా వెలువడింది. శ్రీశ్రీకి కూడా చైనాను తిడుతూ కవిత్వం వ్రాయక తప్పలేదు. ఆరుద్ర వ్రాసిన కవిత్వమంతా వృత్తాలలోనో,

లేదా మాత్రాచ్ఛందంలోనో నడిచింది. చైనా యుద్ధం జరిగినప్పుడు, అధికారరీత్యా ఆత్యయిక పరిస్థితి యేర్పడ్డది. ఆ సమయంలో పౌరుడికి మల్లే కవికి కూడా డిసిప్లిన్ ఉండాలనీ, డిసిప్లిననేది కవిత్వంలో ఛందం వాడితేనే గాని రాదనీ, అందువల్లే నేను ఛందస్సుకు కట్టు పడుతున్నాననీ వ్రాసుకున్నాడు. 1965 లో 'ఎంచిన పద్యాలు' అనే పేర ఆరుద్ర ప్రకటించిన కావ్యంలో వెనక ఎప్పుడో వ్రాసిన ఈ దేశభక్తి కవితలు చాలా కనిపిస్తాయి.

"జగాన సాటిలేని తోట జన్మభూమి యిండియా
యుగాల క్రింద పెన్నడో మహోన్నత ప్రదీప్తిలో
విఘాతమన్న దేదిలేక వెల్గువెల్గె దానినే
సగర్వచూడుడైన నేను శాంతి కాంతి చేసితిన్" అంటూ,
"తల్లి దాస్యము బాప త్యాగ ధనులెందరో
అసువు లిచ్చిన ఫలము అతుల స్వాతంత్ర్యమ్ము
శక్తినంతయు చూపి కట్ట కడపటి వరకు
రక్తబిందువు లోడ్చి రక్షించుకుంటాము'' అని-

దీక్ష పూనుతున్నాడు కవి. ఆ సందర్భంలోనే శ్రీశ్రీ కవిత్వ చ్ఛాయల్లో-

పాటలాగ పాములాగ
వేగంగా కోపంగా
ప్రతి ఒకడూ సైనికుడే
ప్రతి ఒకడూ అతిరథుడే
ప్రతి ఒకడూ రణయంత్రం
ప్రతి నేత్రం శివ నేత్రం
ప్రతి హస్తం యమ నేత్రం
ప్రతి ఒకడూ ప్రతి ఒకడూ
ప్రతి ఒకడూ బ్రహ్మాస్త్రం- అని కదను తొక్కుతున్నట్లుగా

కలాన్ని కదిపాడు. మళ్ళీ ఛందానికి సంబంధించిన ఇరుకు బంధంలో నుండి విడివడి, సర్పయాగం అనే ఖండికలో ఈ సందర్భంలోనే వచన పద్యాన్ని అద్భుతంగా నడిపాడు.

పాలూ పంచశీల పోసి పెంచిన పాములు
నీలు చూచుకుని వేశాయి కాట్లు

విజృంభించండి ఒక్కసారిగా
విరకొట్టండి వాటి నడుములు !- అంటూ,

నమ్మించి ద్రోహం చేసే
నాగు బాములు స్వాహా
నీచంగా కాటు వేసిన
త్రాచు బాములు స్వాహా - అంటూ రణ యాగానికి సమిధల్ని సేకరించాడు. ఆ సందర్భంలోనే చైనా కమ్యూనిజం మీద దెబ్బకొట్టాలని కాబోలు,

''సుత్తీ కొడవలి గుర్తులు
హత్తిన జండా వహించు నతడెందులకా
సుత్తితొ తలపై మొత్తుతు
కుత్తుక కొడవలి ధరించి కోయుట కొరకే!''

అని తీవ్రంగా వ్యాఖ్యానించాడు. ఇది కేవలం చైనా పరంగా చేసిన వ్యాఖ్యానం మాత్రమే. ఆరుద్రకు అంతరంగంలో, ముందునుంచీ, కమ్యూనిజం మీద ఆర్ద్రత లేదని చెప్పడానికి వీలులేదు. 'పైలా పచ్చీసు' అనే కావ్యంలో 1942 కు ముందే ఒక పురోగమన గీతం పాడాడు ఆరుద్ర. అందులో ''జయ జయ ధ్వానాలతో, ఆకాశ మార్గాలలో, అవని చీకట్లలో, బావుటా ఎగరేసి, కాగడా వెలిగించి, నీలాల నింగిలో ఎర్రజండాతో పాటు కదులు, కదులు, కొత్తమార్గాలకై కదలవే కదలవే'' అంటూ తన కవిత్వానికో, లేక దేశానికో మరి పురోగమన గీతం పాడుకున్నాడు. దీన్నిబట్టి 62 లో సుత్తీ కొడవలిని తిట్టడం కేవలం చైనా మీద కసితో మాత్రమే.

(2) అందరు కవులకుమల్లే ఆరుద్ర కూడా కవిత్వారంభ దశలో చాలా వరకూ సెంటిమెంటలిస్టు. ప్రేమ గీతాలు ఎక్కువగానే వ్రాశాడు. ప్రేమకు ఎన్నో రకాలయిన నిర్వచనాలూ చెప్పాడు. మనం సరిగా దృష్టి పెట్టి చూడంగానీ, ఇప్పుడు విప్లవ కవిగా తన్ను తాను పిలుచుకుంటున్న శ్రీ శ్రీ కవిత్వంలో కూడా ఈ సెంటిమెంట్ ప్రభావం ఎక్కువగానే కనిపిస్తున్నది ఇదే ఆరుద్రను అభ్యుదయ కవుల కోవలోనుంచి తప్పించి, నియో క్లాసిసిస్ట్‌గా చూడమంటున్నది-

''చీమ చిటుకుకున్న తానే అనిపించు ఏమిటమ్మ ప్రేమ ఈ

ఛవినే మరిపించు''-అంటూ, కళ్ళకు నిద్రరాకపోయినా, తిన్నది హితవు కాకపోయినా, అడుగులు తడబడి మాటలు పొరబడి, గుండెల దడ దడ హెచ్చినా నీవు ప్రేమలో పడ్డట్టే- అని ప్రేమికుల లక్షణాలను స్పష్టం చేయడానికి ప్రయత్నించాడు.

వియోగ ప్రేమను వర్ణిస్తూ-అనురాగం ఎంతో దూరంగా ఉంది. వియోగమే మిగిలింది. ఎండిపోయిన జీవనదిలో నౌక ఎట్లా సాగుతుంది? చిలక పారిపోయింది. పంజరం మిగిలింది. వేకువ లేదు. ఈ రాత్రి తెల్లవారదు. నా హృదయం పగలగా ఆ ముక్కలు వెయ్యి-అంటూ ఆక్రోశించాడు.

ఈదలేను తీరము చేరలేను. తీరాన నిలబడి తీరుబాటుగ నీవు తిలకించు తున్నావు నా పాటు-నా ప్రాణాలయినా తీయకు. తీరాన దివ్య మధువేదో ఉందని నదిలో దింపావు కానీ, నాకేమీ సాయాన్నందించవు- అంటూ ప్రియురాలి నుద్దేశించి ఆత్మపరమైన తన వ్యథను వెలువరించు కున్నాడు. "మంటినీ మింటినీ ఏకం చేసే వర్షం నిన్నూ నన్నూ ఒకటి చేసి హర్షం కూర్చదా! ఇప్పుడు ఎడతెగకుండా కన్నీటి వానజల్లు నువ్వీ యెడద యిల్లు ఎందుకు విడిచి పెట్టినట్లు ప్రియతమా!" అన్న వేదనా నివేదనంలో భావకవిత్వపు ఛాయలు పటిష్ఠంగా కనిపిస్తున్నయ్. "నన్ను విడిచి పెట్టి దయమాలి వెళ్ళావుగాని, సుఖపడు. కన్నీళ్ళు, కౌగిళ్ళు, ముళ్లు అన్నీ మరచి అవతలి రేవు చేరుకో! నీవు లేకపోతే ఒక్కసారే గుండె పగిలి చచ్చిపోను. నిన్ను తలపోస్తూ బ్రతికి క్షణ క్షణ మరణం చెందు తాను-" అన్నప్పుడు రుబాయీల గుబాళింపులు మనల్ని చుట్టుముట్టక మానవు-

(8) పై రెండు లక్షణాలూ, కవిత్వ ప్రాథమిక దశలో నెలకొన్నవి. తర్వాత, శ్రీశ్రీ సాహచర్యం వల్ల ఆరుద్ర దృక్పథంలో మార్పు వచ్చినట్లుగా కనిపిస్తుంది. శ్రీశ్రీ ఆరుద్రకు చుట్టం. మీదు మిక్కిలి నెచ్చెలి కూడానూ. కమ్యూనిస్టు భావాలమీద ఆదరం పెంచుకున్నాడు. ప్రేమకు సంబంధిం చిన తీవ్రత నశించింది. తనచుట్టూ ఉన్న సమాజాన్ని పరిశీలించాలనే జిజ్ఞాసా, దాన్ని మార్క్సిజంతో అన్వయించి అర్థం చేసుకోవాలనే కుతూ హలమూ పెచ్చాయి. వ్యూదలిజం, వర్గపోరాటం, దుష్టశక్తులు, అభ్యు

దయం, సామాజిక చైతన్యం వంటి పదాలూ, వాటికి సంబంధించిన రకరకాల భావాలూ, గట్టిగా వచ్చి యితని కవిత్వానికి అతుక్కుపోయాయి. ఈ దశలోనే కొన్నాళ్లు ఆరుద్ర అభ్యుదయ కవిగా భాసించాడు. అభ్యుదయ కవిత్వంలో నేను ముందు మనవి చేసినట్లుగా, అంతర్మథనం చాలా ఉంది. సాంకేతికత, ప్రతీకాత్మకత, భావక్లిష్టత- ఇటువంటి లక్షణాలన్నీ కూడా అభ్యుదయ కవిత్వ లక్షణాలుగా చెలామణీ అయినవే. ఇవే ఒక్కొక్కసారి ఆ కవిత్వాన్ని ఒక్క ఊపులో చదివిస్తాయి. పాఠకుడి ఆలోచనలతో దాగుడు మూతలాడతాయి. ఇందులో ఏదో ఉంది, తెలుసుకోవాలనే ఆశనూ కుతూహలాన్నీ రేకెత్తిస్తాయి.

'లోహవిహంగాలు' గీత రచనతో, శ్రీ శ్రీ వెన్నుతట్టగా ఆరుద్ర అభ్యుదయ కవిగా ఆవిర్భవించాడు. ఆరుద్ర తానే చెప్పుకున్నట్లు అప్పటికి నాలుగేళ్ల నుండీ పురిటినొప్పులు పడి కన్న గీతం ఇది. విశాఖమీద జపాన్‌వాడు బాంబులు కురిసిన ఉదంతానికి సంబంధించింది. కవి విశాఖపట్టణానికి రెండామడల దూరంలో ఉండే బుచ్చిరాజుపాలెంలో పది గంటల పగటివేళ బాలభోగాన్ని (Break fast) పుష్టిగా ఆరగించి పడుకున్నాడు. రెండు గంటలప్పుడు ఎండ ప్రచండ గాంథిక భాషలాగా నిప్పులు చెరుగుతుండే తెలివి తెచ్చుకున్నాడు. తన కుటీరానికి దూరంగా జనం పరిగెడుతున్నారు. అప్పుడే విశాఖమీద బాంబులు కురిసి వెలిశాయి. మనుషులు ప్రాణాలు పిడికిట పెట్టుకొని, గుండెలు చేత్తో, పట్టుకుని బలుసాకు వెతుక్కుంటూ బ్రతుకు బాటమీద పయనిస్తున్నారు. మనుషుల వరద పారుతోంది. పేనికా (Panic)నలం మానవాళిలో రగుల్కొంది. కారు మేఘాల్లో మోటారుకార్ల మాదిరి అక్క పక్షిగాళ్ళమీద ఉక్కు పక్షులు రెక్కలు కురిపిస్తూ తిరిగాయి. జపానువాడు మృత్యువుకు టిఫిన్ కారియర్లను తెచ్చి, బే ఆఫ్ బెంగాల్‌లో పెట్టాడు. విశాఖ షిప్‌యార్డునూ, లోకోషెడ్‌నూ ఖచ్చితంగా తినడానికి నిశ్చయించుకున్నాడు. ఈ రకంగా సాగిన లోహ విహంగ రచన, అప్పటి సామాన్య జన జీవన స్థితిని వివరించడానికి మాత్రమే ఉద్దేశింప బడింది- విప్లవ రచనా పద్ధతిగా ఇప్పుడు అగ్గించి చెప్పబడుతున్న జీవితాన్ని మార్చడానికి తిరగబడాలనే పద్ధతులు అప్పటి కింకా అభ్యుదయ కవిత్వంలో ముమ్మరంగా చోటు చేసుకోలేదు. మానవతావాద వాస్తవవాద దృష్టి (Humanistic and Realistic outlook) ఉన్నాకూడా అది అభ్యుదయ కవిత్వమే

అని హేమాహేమీలందరూ ఒప్పుకుని నడుంకట్టిన దశ అది అందుకే శ్రీశ్రీ లోహవిహంగాలను మెచ్చుకోవడం జరిగిం దనుకుంటాను. జాతి నడిచే మార్గం గాని, అది కోరుకునే అభివృద్ధికానీ. సామాన్య ప్రజలకోసమే అనే నినాదాన్ని అప్పటి అభ్యుదయ కవులు చేపట్టారు. ఆ అభిప్రాయాన్ని బాగా వంటబట్టించు కున్న ఆరుద్ర తర్వాత ఎన్నో అటువంటి రచనలు చేశాడు. 'చోబుదారు గల్లీ పిల్ల' అనే ఖండికలో ఈ విషయం స్పష్టంగా తెలుస్తుంది. విశాఖపట్టణంలో యుద్ధం రోజుల్లో ఒక వేశ్య దయనీయ స్థితిని వర్ణించిన ఖండిక యిది. విశాఖ పట్టణపు ముడతలు దేరిన ముఖమండలం మీద చెరిగీ చెరగని కుంకంబొట్టులా ఉందాపిల్ల. ఇద్దరు సిపాయిలు, విమాన విధ్వంసక ఫిరంగుల్ని మోసుకు తిరిగే వాళ్లు, చేరుమాలులో చంద్రబింబాన్ని మూట గట్టగలిగిన వాళ్లు ఆ పిల్లదగ్గరికి వచ్చారు. వాళ్ళకు ఆనందం పంచి, డబ్బు సంపాదించిన గల్లీపిల్ల మర్నాడు పొద్దున డబ్బిచ్చి తన నౌకరును, బియ్యం తెమ్మని బజారుకు పంపించింది—కానీ,

నురుగులు కక్కుతూ ఘోషిస్తూ,
గర్జిస్తున్నది సంద్రం
బియ్యం డిపోల ముందర
ఒకదానిపై ఒకటి

విరుచుకు పడుతున్నాయి కెరటాలు— అంటూ కవి ఒక కొసమెరుపుతో దీన్ని ముగించేశాడు.

అట్లాగే లోకవృత్తం మీద ఆవేశం, అన్యాయాల మీద, ఆకలిమీద తిరుగు బాటు స్పష్టం చేసిన ఖండికలెన్నో ఉన్నాయి. ఈ తిరుగుబాటు విసురులో అక్కడక్కడా శ్రీశ్రీ కనిపించి ఆరుద్ర ముద్రను కమ్మేస్తుండడం మనకు తెలుస్తుంటుంది.

పులి కోరల చలిగాలులు
చలి బాకుల దొంగ పోటు
ఆపిందికి కవచంలా
నడివీధిన పడి బతికే
నీ ఒంటిన గుడ్డలేదు—

కాని, అంతలోనే ఆ ప్రభావాన్ని విదిలించుకుని—

అందాకా

భూలోకం పరుపుమీద

ఆకాశం కప్పుకోని

కడలిహోరు గుర్రుపెట్టి

కలలేవీ కనకుండా

రాజులాగ నిద్రపో

నిద్రపో చిటిపాపా!- అంటూ తన సొంత గొంతుకనే ఆలపిస్తాడు అరుద్ర ఇట్లా ఉదాహరించుకుంటూ పోతే ఎంతైనా గ్రంథం పెరుగుంది.

(4) అభ్యుదయ కవితా చిహ్నాలు ఆరుద్ర కవిత్వంలో ఆవిర్భవించిన తరువాత, సాహిత్యం పట్ల తనకున్న అభిప్రాయాలనూ, విలువలనూ అరుద్ర అబ్బూరి వరద రాజేశ్వరరావు తోటీ, శ్రీ శ్రీ తోటీ కలిసి చర్చించాడు. అదే సినివాలిలో స్వవిషయ సూచిక అనబడే సాహిత్యోపనిషత్తుగా అవతరించింది (1960). దీనికంటేముందు, 1954లో ఆరుద్ర, శ్రీ శ్రీ, వరదలు ముగ్గురూ కలిసి జాయంటుగా 'మేమే' అనే కావ్యానికి రూపాన్ని దిద్దారు. 'మేమే', మీద కవులు ముగ్గురికీ, ఒక భావగాఢత(Seriousness of thought) గానీ, స్వచ్ఛ భావనగానీ (Sincerety of thought) ఉన్నట్లుగా కనిపించదు. ఇందులో ఆషామాషీగా, ముగ్గురూ కలిసి, ఆ క్షణాన తమకు తోచిన భావాలను పదాలుగా మార్చి కాగితాల మీద పొదిగారు. సృష్టిలో తాము ఏమేమి కాగలరో, ఒక అతి వాస్తవ ధోరణిలో పేర్చడం జరిగిందే కాని, తాము ఏమి కాదలచుకోలేదో చెప్పలేదు. సాహిత్య పరంగా చూస్తే, "కవనం మామెరుకు, కవనం మా త్రిశూలం" అనీ, కవిత్రయపు కాపీలం, శతావధానాల చెళ్ళపిళ్ళలం, రువ్విన ప్రణయ గీతాలం అనీ, బమ్మెర పోతులం, అల్లసాని వాడలం అనీ- రకరకాల ఆవిష్కారాలు కనిపిస్తాయి. తాము వ్రాసిందానిమీద తమకే పెద్దగా ప్రత్యయంలేక కాబోలు, తమ ఉమ్మడి మిత్రుడు ఏల్చూరి సుబ్రహ్మణ్యానికి 'మేమే'ను అంకితం చేస్తూ.

రాసిందేదో రాశాం

తీసుకొనుము తోచినంత తీపో చేదో

సీసా పైనేగా మన
ధ్యాస హమేషా గళాసుదాల్చిన ఏసూ !

అని చెప్పుకున్నారు- ఆ తర్వాత 1960 లో సినీవాలిలో ఆరుద్రకూ శ్రీశ్రీకీ మధ్య సాహిత్య లక్షణాలను గురించి కొంత చర్చ జరిగింది.

''ఏమయ్యా కవీ, నువ్వెందుకు రాస్తున్నావ్? నూకలివ్వక పోయినా భావాల మేకలెందుకు కాస్తున్నావ్?'' అన్న ఆరుద్ర ప్రశ్నతో ఆరంభమైన ఈ చర్చలో కవిత్వం పట్ల ఇద్దరి అభిప్రాయాలూ ఇట్లా ఉంటాయి. ఎవరూ చెప్పనిది చెప్పి మెప్పించాలని ప్రయత్నం చేస్తాడు శ్రీశ్రీ.మరొకరు దాన్ని మెచ్చకపోయినా పరవా లేదు. ఇమిటేషన్లు ఇష్టం లేని శ్రీశ్రీకి కొటేషన్లంటే ఇష్టమే. నిన్నటి కవుల నుండే నేటి కవులు ఉద్భవిస్తారనేది అప్పటి శ్రీశ్రీ భావన. కవి కోరుకునే మెప్పు సమాన ధర్ముల శిరఃకంపం, హృదయ స్పందన. కవిత్వం జనాన్ని మేలు కొలపాలి గాని జోకొట్ట కూడదు. వానలాగా కవిత్వం ప్రజల హృదయాలలో వర్షించి కొత్తభావాల బీజాలు చల్లాలి. ప్రజాస్వామ్యాన్ని అంగీకరిస్తూనే మెజారి టీకి అందని ఊహలు వెదకాలి. కవిత్వానికి ఒక్కోసారి వ్యాఖ్యాత ఉండడం అవసరం అన్నాడు. కవిత్వానికి ఆరోగ్యకరమైన పోటీ అవసరమన్నాడు. పోటీలో ఓడిపోయినా, బాగా ఆడి ఓడిపోతే ప్రేక్షకుల సానుభూతి ఉంటుందన్నాడు. కవిత్వం మనిషి కోసమనీ, నవత్వం మంచి కోసమనీ, నవత్వం + మానవత్వం = కవిత్వమనీ వివరించాడు. అక్కడినుండి తిరకాసుగా సంప్రదాయం మీదికి వచ్చేశాడు శ్రీశ్రీ. చూశావా ఆరుద్రా సంప్రదాయం నిలిచే ఉంటుంది. మూధా చారాలు మారుతుంటాయి. కాని సంప్రదాయం తాతముత్తాతల నాటి ధనం అని ఆనాడు ఒప్పుకున్నాడు శ్రీశ్రీ. అంతేకాక కవి ఋషిలాంటి వాడనీ, రంజన కలిగి స్తాడనీ, డిసిప్లిన్ అనేది అడుగు అడుగు వేసుకుంటూనే వెళ్ళడమనీ, అదిలేని జాతి పురోగమనం నిల్ అనీ వివరించాడు. అయితే డిసిప్లిన్ పేరు చెప్పి అన్వేష ణను అరికట్ట కూడదని కూడా అన్నాడు. శ్రీశ్రీ వివరించిన ఈ అభిప్రాయాల కన్నిటికీ ఆరుద్ర ఆమోద ముద్ర వేశాడు. అంతేకాక, ఎప్పుడూ పాతను తలుచు కుంటూ ఇప్పుడూ అదే గొప్పని నిక్కడం క్రైమ్. ఈ నాటికీ గతానికి గబ్బిలాల్లా వేలాడేవాళ్ల వేనవేలు. వెనకచూపు వాళ్లువేయిమందున్నా ముందు చూపు కవి ఒక్కడు చాలు. వాడు అవశ్యం కలిగిస్తాడు మేలు, మేలుకొంటాడు రోగిష్టి

మానవుడు. పాము వంటి దానికి విరుగుడుంది పాత తత్త్వానికి లేక పోతుందా! అని ఆశాభావాన్ని చూపించాడు. మెదడూ హృదయమూ మిళితమయ్యే గుణమే మహాకావ్యానికి ఏకైక లక్షణంగా ఒప్పుకొన్నాడు. కవిత హృదయానికి నరిష్మెంట్ కావాలి కానీ మెదడుకు ఏ నాటికీ పనిష్మెంట్ కాకూడ దన్నాడు.

శ్రీశ్రీకీ ఆరుద్రకూ మధ్య జరిగిన కవిత్వాన్ని గురించిన చర్చకున్న స్పష్టత మళ్ళీ ఆరుద్రకూ సరదకూ మధ్య లేదు. అక్కడ వాళ్ళిద్దరూ ఒక అభిప్రాయాన్ని స్పష్టం చేస్తున్నామన్న విషయం మర్చిపోయి తాము చెప్తున్న వచన పాదాల అంత్యప్రాసల మీదా అనుప్రాసల మీదా దృష్టి పెట్టుకుని అక్కడే కూర్చుండి పోయారు.

(5) ఇక్కడనుండి ఆరుద్ర అభ్యుదయ కవితారంగంలో ఒక స్థానం సంపాదించుకున్నట్లే. అప్పటికి, ప్రియురాలు భార్యగా; ప్రేమ, కుటుంబ జీవనంలో ఒక విడరాని భాగంగా, స్థిరపడిపోయింది. దేన్ని పడితే దాన్ని మెచ్చుకునే కౌమార స్థితి దాటి. చుట్టూ ఉన్న విషయాల మీద నిశితమైన అవగాహన ఏర్పడ్డది. సాహిత్యం వల్ల ఒక ప్రయోజనాన్ని సాధించాలనే తపనకూడా కలిగింది. కాని ఇటువంటి సాహిత్య విషయకమైన మనస్స్థితితోపాటు, కవిత్వం చెప్పే విధానంలో కొత్త ప్రయోగాలు చెయ్యాలనే కాంక్షకూడా ముమ్మరంగా పెరిగినట్లు కనపడుతుంది. 1948 లో వ్రాసిన త్వమేవాఽహాన్నీ, 1960 లో అచ్చయిన సినీవాలినీ క్షుణ్ణంగా పరిశీలిస్తే ఆ విషయం స్పష్టం కాగలదు.

ఆరుద్ర మొదట దీనికి తెలంగాణా అనే నామకరణం చేస్తే, శ్రీశ్రీ దాన్ని త్వమేవాహం అని మార్పించాడట (1955 లో) మూడవ ముద్రణలో కవి, తర్వాతెప్పుడో కాలం అనే పేరిట తాను వ్రాసిన ఖండికకు ఆవాహన అని తిరిగీ నామ కరణం చేసి, దాన్ని త్వమేవాఽహానికి ముందు చేర్చుకున్నాడు. త్వమేవాఽహాన్ని ఆసాంతం చదివి దీనికి కాలం అనే పేరును కవి పెట్టి ఉండవలసిందనుకున్నాను. కాలానికీ కవికీ అభేదం చెప్పే కావ్యమిది–ఆద్యంత రహితమైన కాలంతో, మానవుడు, తన్ను గ్రహించడానికి సర్వ ప్రయత్నాలూ చేసే మృత్యువును నిర్లక్ష్యం చేస్తూ, అభేదాన్ని చాటుకుంటున్నాడు. మానవుడు చిరంజీవి.

నిజానికి మనుష్యుడికి సంబంధించిన కాలం, అతడు భూమి మీద పడ్డ క్షణం నుంచీ మొదలవుతుందని కదా సర్వసాధారణమైన అంచనా. కవి దాన్ని అంగీకరించడు. మాతృగర్భస్థమైన పిండానికి సంబంధించిన కాలం ఆ పిండంలో నుండి ఉద్భవించిన మానవుడిది కాదా! పిండం ఏర్పడక ముందు, పితృ హృదయంలో ఉద్భూతమైన కోరికకు సంబంధించిన కాలం కూడా ఆ మానవుడిదే కాదా! ఆవిధంగా తండ్రి, తాత, ముత్తాత నుండి-ఆదిమానవుడి వరకూ వెనక్కి పరిగెడితే, ఆ కాలానికీ ఈ మానవుడికీ సంబంధమున్నట్టే కదా! అందుకే మానవుడు చిరంజీవి. అఖండ ప్రవాహంలాంటి కాలంలో అభేదం చెప్పుకునేవాడు-ఈ సంబంధాన్ని సూచించడానికే, తన కావ్యంలోని కాల గమనాన్ని కొన్ని దశలుగా విభజించుకున్నాడు కవి. అవి (1) పర్వతదశ (2) ఉపనదులు (3) ప్రవాహ దశ. అనేవి మూడు దశలు- వీటికి తోడు, (4) నదీముఖద్వారమూ (5) సాగర సంగమమూ అనే రెండు దశల్ని వివరిద్దామనుకుని కూడా కవి ఎందుకో మానుకున్నాడు.- ఒక్కో దశలో కొన్నికొన్ని అంశాలు పేర్కొనబడ్డాయి. పర్వత దశలో ఎలారం, పెద్దముల్లు, సెకెండుముల్లు, చిన్నముల్లు, పెండ్యులంలు పేర్కొనబడ్డాయి. ఇవన్నీ సంకేతాలు-పెద్దముల్లు మిడిల్‌క్లాసు మనుషుల భావాలకు సూచిక-సెకండుముల్లు శ్రామికజనం ఫిలాసఫీకి కొలతబద్ధ, చిన్నముల్లు శ్రీమంతుల మనస్తత్వానికి సూచిక, పెండ్యులం కవి మనస్సే అనుకుంటాను. అట్లాగే రెండవదశలో పర్వతాల మీదనుంచి ప్రసరించే సెలయేరులాంటి కాలానికి ఎన్నో ఉపనదులు కలుస్తాయి. ఇక్కడ సెకెండ్లు 'అలగా' జనం- ఇసక గడియారం, నీటి గడియారాలు పాతకాలపు సంఘాలు. గడియారం మన సంఘమైతే గంటలు ధనవంతులు. స్టాప్‌వాచ్ విప్లవాన్ని తెలియజెప్పే సాధనం.- ఈ వివరణంతా ఆరుద్ర తాను దాశరథికి వ్రాసుకున్న ఉత్తరంలో ఇచ్చిన వివరణే. ఈ వివరణ పట్టికను దగ్గర పెట్టుకుని, మరికొన్ని కవి స్వయంగా వెల్లడించిన విశేషాలను కలుపుకుని త్వమేవాఽహాన్ని చదివితే కొంతలో కొంత అది అర్థం కావచ్చును- కవి 1948 వ సంవత్సరం జూలై పదవ తారీఖున కృష్ణాపత్రికలో "నాకా సిగ్గు, నా స్త్రీత్వం ఎప్పుడో పోయింది" అనే శీర్షికతో ఒక వార్త చదవడం జరిగింది.-రైల్లో మూడవతరగతి పెట్టెలో(అప్పుడుంది)ప్రయాణికులంతా తీరిగ్గా కూర్చుని హైదరాబాదులో రజాకార్లు చేస్తున్న దురంతాలకు విచారిస్తుంటే ఒక స్త్రీ ఆవేశంతో వాళ్ళముందు నగ్నంగా నిలబడి, తనకు రజాకార్ల

వల్ల జరిగిన దురంతాన్ని చెప్పి, ఒంటిమీద గాయాలను చూపిస్తూ, ఏ ప్రతిచర్యా చెయ్యలేని నిస్సహాయ స్థితిలో తీరిగ్గా ఇట్లా మాట్లాడుకోవడానికి మీకు సిగ్గులేదా అని ముక్కచివాట్లు పెట్టిందట. అట్లా పెట్టి పెట్టకపోయి జనాన్ని జరుగుతున్న దురంతాల పట్ల ఆవేశపూరితుల్ని చేసి రెచ్చగొట్టడం ఆమె నిర్ణయించుకున్న పథకం. ఈ వార్త కవిని బాగా కదిలించి అతనిచేత కలం పట్టించింది. త్వమేవాఽహం ఆవిర్భవించింది-

అయితే, కవి, తానులోనైన ఆవేశాన్ని, ఉద్రేకాన్ని, స్వేచ్ఛగా, సూటిగా కాగితం మీదకి రానీయలేదు. వినేవాడికి రెట్టింపు ఆవేశం కలిగే విధంగా సరళంగా సూటిగా ఉండవలసిన అవసరం తీసుకొన్న విషయానికి ఎంతైనా ఉంది. కాని ఆరుద్రను కేవలం హృదయ సంబంధమైన భావాన్ని ఏ ముసుగులూ లేకుండా శక్తిమంతంగా చెప్పే సిసలైన కవి అని ఖచ్చితంగా ఒప్పుకోవడానికి వీలులేదు. ఆరుద్ర పండితకవి. కవిత్వంతోపాటు ప్రయోగాలూ, వాటికి సంబంధించిన నవ్యత్వమూ అనే అంశాలకోసం వెంపరలాడే బుద్ధిజీవి ఆరుద్ర-"టెక్నిక్ లేని కవిత్వాన్ని నేను ఊహించలేను. ప్రత్యేక సంవిధానరహిత వాక్య సందోహాన్ని నేను కవిత్వంగా ఎంచలేను'' అని తనే వ్రాసుకున్నాను. దాశరథికి ఒక ఉత్తరం వ్రాస్తూ, ఈ కవిత్వ శిల్పాన్ని అభిమానిస్తూ ఎంతవరకూ వెళ్ళిపోయాడో ఆరుద్ర మాటల్లోనే మనం వినడం సముచితం.

''ప్రియాతి ప్రియమైన దాశరథీ......

''నువ్వునేనూ అభ్యుదయ కవిత్వ ప్రయోజనాన్ని గుర్తించాం. మన కవిత్వం ప్రజలకోసం అని మనకు తెలుసు. మన ప్రయోజనాన్ని సాధించలేని కవిత్వం మనకు రుచించదు. కాని కవిత్వం కానిది మన ప్రయోజనం కోసం ఎవరు వ్రాసినా అది అసలే రుచించదు. అభ్యుదయ నిరోధకుడు కవిత్వ వ్రాసినా అది కవిత్వంగా మనం గౌరవిస్తున్నాం. ఆ శిల్పాన్ని మెచ్చుకుంటున్నాం. కాని దానిలోని ''ప్రతివిప్లవ" భావాన్ని ఖండిస్తున్నాం. శిల్పంలేని దాన్ని మనం ఎంత ఉత్తమాదర్శప్రేరితమైనా హర్షించలేక పోతున్నాం'' అని వ్రాస్తూ, అభ్యుదయ కవిత్వం వేరూ, ప్రజాకవిత్వం వేరూ అనే వింతవాదనలో పడిపోయాడు ఆరుద్ర- ఎంతో టెక్నిక్‌తో వ్రాసిన తన త్వమేవాఽహాన్ని జనం ఎందుకు అర్థం చేసుకోలేకపోతున్నారో అంటూ Christopher Caudwell మాటల్ని ఉటంకించాడు.

"కవి శిల్పి. అతని చేతులో ఉండే కళకు ఉత్కృష్టమైన శిల్పం ఉండి తీరాలి– కాని అభివృద్ధి పొందిన పెట్టుబడిదారీ విధానంలో జనానికి చాలా మంది కీ శిల్పం (Techinic) నచ్చదు. ప్లాస్టర్లు వాడే యుగంలో రాతిచెక్కడాలను గురించి జనానికి ఏమీ తెలియనట్లుగా. ఇటువంటి సాంకేతిక నిపుణుడైన కవి ఎందుకూ పనికి రాకుండా పోతాడు. సంఘంలో ప్రోలిటేరియనైజేషన్ ఎక్కువైనకొద్దీ మనుష్యులకు తీరిక తక్కువై, లోతు తక్కువా, శిల్పం తక్కువా అయిన సాహిత్యాన్ని అభిమానిస్తారు. అందువల్ల శిల్పంమీద మోజుతగ్గని కవి సామాన్యుల ఎత్తును అందకుండా పోవడం జరుగుతుంది. అందుకే అతని రచనలు వాళ్ళకు అర్థంకావు–" తన శిల్పభూయిష్ఠమైన త్వమేవాఽహ రచనను సమర్థించుకున్నాడు– "టెక్నిక్‌కీ విషయానికీ జరిగే యుద్ధంలో ఆశయానికీ ప్రతిఫలానికీ జరిగే కుస్తీలో చిత్తశుద్ధిగల మన కవిత్వం జయించాలి" అంటూ– "నా తపస్సు ఫలించి నా గీతం గుండెలలో ఘూర్ణిల్లగ నా జాతి జనులు పాడుకునే మంత్రంగా మోగించాలని" ప్రతిరపీ అనుకుంటాడు– అది సాధించడానికి కృషి చెయ్యాలి అని ఆశిస్తున్నాడు. ఎంత పరస్పర విరుద్ధ విషయాలు!– జనం 'Low brow' అయ్యారనీ, తాను తన శిల్పంవల్ల 'High brow' గా వీళ్ళకు అందని ఎత్తున ఉండిపోయాననీ వాపోతూ, మళ్ళీ శిల్పభూయిష్ఠమైన తన గీతం జాతి జనులు పాడుకునే మంత్రంగా మోగించాలని ఆశపడడం,–దీన్నేమనాలి?– బహుశ ఆరుద్ర దృష్టిలో, జాతి జాతంతా ఒకనాటికి ఈ ప్రోలిటేరియనైజేషన్ నుండి బయటపడి, తన ఎత్తుకు పెరిగి తన శిల్పాన్ని అవలీలగా అర్థంచేసుకుంటారనా? ఏమయినా ఇది మంచికల!

శిల్పం అని పేరుపెట్టి, పాశ్చాత్య సాహిత్య ప్రపంచంలో రూపుదాల్చిన అనేకానేక అస్త్ర వ్యస్త ప్రక్రియల్ని తెలుగులోకి తీసుకురావడానికి తొలినాటి నవ కవులు చాలామంది ప్రయత్నించారు. శ్రీ శ్రీ కూడా అందుకేమీ అపవాదం కాదు. బహుశా అందుకేనేమో, తొలిరోజుల్లో నవ్య కవిత్వమంటే ఆయోమయ కవిత్వమనే అభిప్రాయం చాలామందికి ఏర్పడ్డది. శ్రీశ్రీ, ఆరుద్ర తాము చర్చించిన సాహిత్యోపనిషత్తులో ఈ విషయం స్పృశించడం జరిగింది.

"బాగా ఆడి ఓడిపోయిన టీముకి
ప్రజల సానుభూతి ఎప్పుడూ ఉంటుంది.

ఆదిలో అవహేళన పాలైన ఆధునిక కవిత
అభ్యుదయ మార్గంలో పయనించడం చూసి
ఆదరించడం లేదా నేటి మేలుకొన్న జనత!"

అని ఒకరి నొకరు సమాశ్వసించుకున్నారు, కవిమిత్రులు-

1948 నాటి ఆరుద్ర చిత్తవృత్తి శిల్పాభిముఖమైనదే. కాని 1960 నాటికి అది బింకాన్ని సడలించుకుని కొంతలో కొంత ప్రజాభిముఖంగా మారిందనే చెప్పవచ్చు. అందుకే కవి తన సాహిత్యోపనిషత్తులో,

''కావ్యం ఏదైనాసరే
కనీసం ఒక రిక్వైరుమెంటు!
కావాలి కవిత హృదయానికి నరిష్మెంటు
కారాదు ఏనాడూ మెదడుకు పనిష్మెంట్''

అని ఒప్పేసుకున్నాడు-

ఆరుద్ర మరో కావ్యం సినీవాలి. అమావాస్యనాటి చంద్రకళకు సినీవాలి అనిపేరు. అమావాస్య చిక్కటి చీకటికి కాణాచికదా. ఆనాడు చంద్రకళ కనపడుతుందా? కనపడదు. కనపడకపోయినా ఉంది.అష్టకష్టాలూపడుతూ అకటావికటపు చీకటి బ్రతుకులు బ్రతికే దీనుల జీవితాకాశాల్లో కూడా వెలుగు రేఖలుండి తీరాలి. కవి పెంపొందించుకునే ఆ ఆశయొక్క రూపమే సినీవాలి కావ్యం. ఇందులో త్వమేవాఽహంలో ఉన్నంత టెక్నిక్ చిక్కదనం లేదు. ఆరుద్ర కవిత్వం ప్రజాభిముఖం అవుతున్న దనడానికి ఇదో శుభ చిహ్నం.

మనుషులను గురించితప్ప మరో వస్తువు మీద మాటలు కట్టటానికి నాకు మనసు రాదంటూ కవి యిందులో నగర వర్ణన ఆరంభించాడు. ఆ నగరంలో ఒక యువకుడు. వాడి పేరు సూర్యుడు. కళాశాల నుండి నిష్క్రమించి కళ్ళు మూసుకుని నగరంలో ప్రవేశించాడు. బోను తెరిస్తే నోరుతెరిచే పెద్ద పులి వంటి నగరయామిని సూర్యుణ్ణి చాలా సతాయించింది. అక్కడ అతనికి కలలుకనే చంచలా, నిస్సార జీవితం వద్దని సారవంతమైన కష్టాల నాహ్వానించే చపలా తారసపడతారు. వాళ్ళేకాక, వయసుమీరిన వృద్ధులూ, గెంతే పసివాళ్ళూ,

అందరూ పాపాల దారిపట్టి పయనించి నరకద్వారాల వైపు వెళ్ళిపోతున్నారు. పైగా నిస్సారమైన మర్యాదా మప్పిదాలకన్నా సారవంతమైన పెద్దతనం మేలని సవాలు చేస్తున్నారు. వాళ్ళని చూచి మధన పడుతున్న సూర్యుణ్ణి అపురూపమైన అతిలోక రమణి సమాశ్వసించింది. ఆవిడ శాంతి. జీవితఫలాన్ని సాధించి దేశాని కందిమ్మని ఆదేశించింది. ఎట్లా ఆ జీవన ఫలాన్ని సాధించడం? ఎట్లా దాన్ని దేశానికి పంచడం అని మధన పడుతుండగా, ఎదురుగా రాజకీయ ననంద సాక్షాత్కరించింది. ఆవిడతో కలిసి శ్రామిక స్వర్గాన్ని సాధించదల చాడు సూర్యుడు. కాని మోసంతో కూడిన ఆ పరిధిలో ఇమడలేక సంజ చీకటి వంటి స్వగ్రామ మనే పంజరంలోకి పరుగెత్తుకొచ్చాడు. తండ్రి చాటున తల దాచుకోదలచుకున్నాడు.

తర్వాత రెండో అధ్యాయం. అది చిన్న అచ్చులో నాటకంలాగా సంభాషణాత్మకంగా ఉంది. కొడుకును పెళ్ళిచేసుకుని తీరాలంటే శ్రీమంతుల కూతుళ్ళనూ, అందమైన వాళ్ళనూ, ఆడంబర వర్తనలనూ వదిలేసి తన జీవన ఫలాన్ని ఊహాసుందరి కిస్తాడు కొడుకు.

మూడో అధ్యాయంలో, పల్లెల్లో ప్రాణవాయువు పీల్చలేక, బొగ్గుపులుసు గాలుల బోనులోకి, నగరంలోకి, వినయ విధేయతలున్న సర్కస్ జంతువు లాగా ప్రవేశించాడు సూర్యుడు. ప్రేమించి పెళ్ళి చేసుకున్నాడు.

నాలుగో అధ్యాయంలో చక్కని సంతోషాల చిలక లెగరిపోయి ఇక్కట్ల గబ్బిలాలు ఇంట్లో స్థిరపడ్డాయి. ఆదర్శాలు మారిపోయాయి. ఆవేశాలు చల్లారిపోయాయి.

అయిదో అధ్యాయంలో సూర్యుడు క్లార్కు సూర్యారావుగా మారిపోయాడు. అతడే యన్. జి. వో సూర్యుడు. ఇల్లు ఇరుకటము ఆలి మర్కటము అయినా, ఇంట్లోనే కునుకు తీద్దామని తలుపుదాకా వచ్చాడు. తలుపుకు చేరబడి నిద్రపోయాడు. నిద్రలో కల, కలలో సూర్యారావు బలవంతుడు, ఆగర్భ శ్రీమంతుడు- రోగిష్ట భార్య రొప్పుకుంటూ వచ్చి తలుపు తీసింది. కల చెదిరిపోయింది.

సూర్యుడికి ఉద్యోగం ఊడిపోయింది. మృత్యువు తరుముకుని వచ్చింది.

చివరకు ఫల్రశ్రుతిగా కవి దీన్ని విషాదాంతం అనుకో వద్దన్నాడు. "ఈ కావ్యం అంతం లేనిది, నిరాశలో నుండే ఆశ జనిస్తుంది. సమకాలిక జీవన విభావరిలో తమస్సులే ఘనీభవించడం లేదు. అతి సన్నని వెలుగు రేక కూడా ఉంది. అశా చంద్రకళగల ఈ కావ్యం అందుకే సినీవాలి-" అని కవి వివరించాడు.

సమకాలిక సామాన్య జీవన చిత్రణాన్ని చాలా పదునుగా చేశాడు ఆరుద్ర. అందుకు ఇంగ్లీషు మాటలు ఎంతో సమర్థవంతమైన సేవ చేశాయి కవికి. ఇందులో కూడా టెక్నిక్ ఉంది. సూటిగా కవి మన యెదురుగా వచ్చి చెప్తున్న వాడల్లా, ఉన్నట్లుండి తెరచాటుకుపోయి పాత్రల్ని ప్రవేశపెట్టాడు. పాత్రలకు పేర్లు పెట్టడంలోనూ, మాట్లాడే రామ చిలక, మలాకా జాంపండు, వంటి ప్రతీకల్ని సృజన చెయ్యడంలోనూ, కథ అల్లడంలోనూ కొత్తదనం కనిపిస్తుంది. ఇటువంటి కొత్తదనాలు లేని కవిత్వం అది కవిత్వమే కాదనుకునే మనస్తత్వం ఆరుద్రది. కాని చదువుకున్నవాడు, ఎన్నో ఊహలున్నవాడు, కొన్ని కొన్ని రంగాలలో జీవితాన్ని తరిచే ప్రయత్నం చేసినవాడు, స్వయంగా పల్లె వద్దని పట్టణాన్ని వలచి నగరంలో స్థిరపడ్డవాడు, పెళ్ళాడి, క్లర్కుగా స్థిరపడి, చావు వరకూ నిరాశతో కష్టాలతో వేగిపోయాడని చెప్పడమే కవి ధ్యేయంగా కనిపిస్తున్న ఈ కావ్యానికి, కవి ఎంత సమర్థించినా అ పేరు నప్పలేదనే నాకనిపించింది.

(6) 1960లో సినీవాలి ప్రచురించిన తర్వాత వరసగా 1964లో కూనలమ్మ పదాలనూ, 1965లో ఎంచిన పద్యాలనూ, 1969లో ఇంటింటి పజ్యాలనూ ప్రచురించాడు కవి.

'కూనలమ్మ పదాల'ను, ఆరుద్ర అభిప్రాయం ప్రకారం అంచనా వేస్తే ప్రజాకవిత్వం కింద జమకట్టవలసి వస్తుంది. తెలుగు దేశంలో వ్యవహారంలో ఉన్న కూనలమ్మ పదాలకు, ఇది 'ఛాణీ ఇమిటేషన్' మాత్రమే. కవి నానాజాతి సమితిలాగా, ఇందులో తడవని అంశం లేదు. ఇవి శ్రీశ్రీ అన్నట్లుగానే ఆరుద్ర సరదాలు. ఇందులో అయోమయ లక్షణంగానీ, అందని టెక్నిక్ కానీ పొదగడానికి వీలు కలగదు.

ఇంటింటి పజ్యాలను చూస్తే ఆరుద్ర త్వమేవాఽహం దశనుండి ఎంత పరివర్తనం చెందాడో స్పష్టంగా కనిపిస్తుంది. దీనికి నండూరి రామమోహనరావు పీఠిక వ్రాస్తూ, "చెప్పదలచిందాన్ని సూటిగా, స్పష్టంగా, అందంగా చెప్పడం చేతకానప్పుడు తప్ప, కవిత్వంలో అబ్‌స్క్యూరిటీ ఉండవలసిన పనిలేదు. మళ్ళీ వీళ్ళు ప్రజలకోసం ప్రజల భాషలో రాస్తున్నామంటారు. సులభమైన పదాలతోనే అయఃపిండాలవంటి పద్యాలు పద్యాలు రాయడాన్ని ఒక లలిత కళగా రూపొందిస్తూన్నారు కొంతమంది. ఇంటింటి పజ్యాలు నిజంగా ఇంటిల్లపాదీ చదువుకోవడానికి రాసిన పద్యాలు"- అని వివరించారు.

ఈ పీఠికను అంగీకరించిన ఆరుద్రకూ. త్వమేవాఽహం ఆరుద్రకూ ఎంతతేడా!

"టెక్నిక్కూ విషయానికీ జరిగే యుద్ధంలో, ఆశయానికీ ప్రతిఫలానికీ జరిగే కుస్తీలో చిత్తశుద్ధి గల మన కవిత్వం జయించాలి దాశరథీ!" అని వాపోయిన ఆరుద్ర ఇలాంటి పజ్యాల నాటికి ఎంత ఎదిగాడు? ఎంత మార్పుకు లోనయ్యాడు? ఏ తొడుగులూ, ఏ యిజాలూ కలవరపెట్టని కవిగా, వ్యక్తులో, సంఘటనలో, రాజకీయమో, మరొకటో ఏది మనస్సును మథిస్తే దాన్ని కావ్య వస్తువుగా స్వీకరించి, వినేవాడి గుండెకు సూటిగా తగిలే పద్ధతిలో తన భావాన్ని మలచడానికి అలవాటు పడ్డాడు. నిజమైన కవిగా ఆవిర్భవించాడు.

(7) ఆరుద్రకు పదాలు ఎంతో సేవ చేస్తాయి. చెప్పినమాట వినే వినయవంతులైన సేవకుల్లాగానే పనిచేస్తాయి. అవి ఇంగ్లీషుకానీ, హిందీకానీ, మరే భాషకు చెందిన పదాలయినా కానీ, అతని చేతుల్లో మైనం ముద్దల్లా ఒదుగుతాయి. ఇంగ్లీషు పదాలను కవిత్వంలో వాడకూడదేమో అనే బెరుకు కవికి ఏ కోశానా లేదు. ఇంటింటి పజ్యాలలో, ఈ పజ్యంలో ఎన్ని భాషలో!

"తెరకీ మనకీ మధ్య అతగాడి కాయం అడ్డుగోడ
కరుణించి మనక్కనపడే చిత్రం రూపాయిలో బేడ
బొమ్మలాగా కనపడదు విందామనుకుంటాను
పాటల్లో కొన్ని ముక్కలు
'సుమ్మా యిరక్క మాటార్' మాటాడే అరవ అమ్మలక్కలు

ఇంటికి పోదామనుకుంటే షరా మామ్మూలు
ఇవ్వబడదు వాపస్ రుసుమ్ములో సగమ్ములు
ముందు సీట్లో కూచోకూడదా అందమైన ఆడపిల్ల
హాయిగా చూడొచ్చు ఆమె ఊగే రోలక్కు
పొందరాని అనుభూతి పొందే వేళలో పక్క
నుంటుంది భార్య అదేనయా మన లక్కు—''

కవిత్వంలో ఇట్లా అన్యభాషా పదాలను అంత్యప్రాసలకూ అనుప్రాసలకూ వాడుకుని భాషకో అందాన్ని తెచ్చాడు కవి. ఉపమానాలనూ, ఉపమేయాలను గూడా ఇంగ్లీషు పదాల్లో చెప్పాడు. ఇంగ్లీషు క్రియలకు ఇంచుక్కులు మిళాయించి సరదాగా వాడుకున్నాడు. ఇటువంటి చోట్ల, ఎవరూ అనుకరించలేని ఆరుద్ర ముద్ర స్పష్టంగా కనిపిస్తుంది.

అట్లా అని స్వచ్ఛమైన తెలుగులో కలం కదపడం చేతకాని కాడు కవి. నుడికడలిని సంకలనము చేసిన కవిగారు మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు దివంగతులైనపుడు ఆయన స్మృత్యంకంగా ఆరుద్ర వ్రాసిన మాత్రాచ్ఛందం మరచి పోలేనిది—

''నుడి కడలి కడుపులో సుడుల అడుగున పడిన
ఏ మంచి ముత్యాల ఏరుటకు ఏగిరో
కవిగారు మరిరారు కంటి కగుపడబోరు
పిడుగు మాదిరి మాట ఎడదపై పడగానె
వాడి ముమ్మొన వాలు మేను చీల్చిన లీల
వెలుపడును వెల్లువై వేడి నిట్టూరుపులు
........................
........................
సిరిమించు నుడిమణులు సేకరించే ఋషులు
అస్తమించిన కొరత అది కొంచెమా ఉహూఁ!''

తియ్యని తెలుగు మాటల కలకలారవం దీని నిండా—

(8) ఈ రకంగా కవిగా ఆవిర్భవనం చెందిన ఆరుద్ర ఇటీవలి కాలంలో కవితా వ్యవసాయం ఏమీ మనఃపూర్తిగా చెయ్యడం లేదనే అనిపిస్తుంది.

అడపాదడపా కది సమ్మేళనాలలో తప్ప కావ్యరచనకు ఆయనకు తీరిక లేకుండాపోతున్న దనుకుంటాను. ఉన్న కాలాన్ని సగానికి పైగా సినిమా ఫీల్డు తినేస్తున్నది. మిగిలిన సగంలో అతని కవిత్వానికి పాండిత్య ప్రకర్ష ఆనే మరో సపత్ని దాపురించింది. సమగ్రాంధ్ర సాహిత్య సంపుటాలు వెలువరించిన ఆరుద్రకూ, ఆంధ్ర దేశంలో మాతృస్వామ్య వ్యవస్థ మీద పరిశోధన చేసే ఆరుద్రకూ, వేమన్నకు వ్యాఖ్యానం చెప్పే ఆరుద్రకూ, కవిత్వం వ్రాసుకోవడానికి తీరికెక్కడుంటుంది?

ఒకప్పటి సినీవాలి వంటి కావ్యాన్ని, దృక్పథాలలో రకరకాల మార్పులు తెచ్చుకున్న ఆరుద్ర, మరొకటి వ్రాయాలి. తనలో ఉన్న కవిని స్థిరస్థానంలో నిలవబెట్టుకోవాలి ఆరుద్ర !



# కుందుర్తి

## శ్రీ అద్దేపల్లి రామమోహనరావు

అభ్యుదయ వచనగేయ మార్గ దర్శకులైన కవులలో శ్రీ కుందుర్తిది ఒక విశిష్టమైన స్థానం. ప్రజాపరమైన వచనగేయంలోని వస్తు శిల్పాల్ని గూర్చి తాను కొన్ని సిద్ధాంతాల్ని ఏర్పరచుకొని వాటిని నిశ్చలంగా జీవితంలో అనుసరిస్తూ రావడం ఒక ప్రత్యేకమైన వ్యక్తిత్వం గల వాడికే చెల్లుతుంది అందులో ఈ ఆధునిక యుగం కవుల స్థిరచిత్తాన్ని పట్టి పరీక్షించే కాలం. రోజుకో రాజకీయం, పూటకో సిద్ధాంతం, గంటకో రచనారీతి కవుల్ని మార్చేస్తోంది.

మార్పు రావడం ఆశ్చర్యకరం అనిగాని, అది దోషమని కాని నా అభిప్రాయం కాదు. కాని ఏ దృక్పథమూ లేక, తాత్కాలిక ప్రచారం కోసమో, వ్యామోహం కోసమో, గుంపు కట్టడం కోసమో, ఇమేజి నిలుపుకోడం కోసమో, చాలామంది కుందుర్తి నాటి రచయితలు చిత్ర విచిత్రమైన మార్పుల్ని తమ రచనల్లో చూపించి ప్రజల్ని ఆశ్చర్య పరుస్తున్నారు, అంచనాకి అతీతంగా ప్రవర్తిస్తున్నారు. జీవితంనించి, అంతరంగంనించి దూసుకు వచ్చిన మార్పు, అదెంత మార్పైనా సరే, ఆహ్వానించ దగ్గదే. కాని పునాదిలేకుండా బాహ్యమైన కొన్ని తాత్కాలిక పరిస్థితులవల్ల మార్పు తెచ్చుకునే కవి వ్యక్తిత్వంలో ఏదో ప్రస్ఫుటమైన లోపం ఉన్నదని అర్థం. అటువంటి లోపాలకు లోబడకుండా, ఎవరేమన్నా దానికీ చలించకుండా, కవిత్వాన్ని గూర్చి తన నిశ్చిత నిశ్చల అభిప్రాయాల్ని మార్చుకోకుండా అనుసరిస్తున్న విశిష్ట వ్యక్తిత్వం గల కొద్దిమందిలో కుందుర్తి ఒకరు. బహుశః ఈ భావాన్ని మనసులో పెట్టుకునే ఒక ప్రసిద్ధ రచయిత కుందుర్తి "ఒకరిద్దరిలో ఒకరు'' అనే మాట అని ఉంటారు. కుందుర్తియే తన వ్యక్తిత్వాన్ని గూర్చి "నాలో నినాదాలు'' అనే స్వీయ హృదయావిష్కరణ కావ్య సంపుటిలో ఒకచోట చెప్పుకుంటారు-

''సమీక్షకులు నానా చీవాట్లు పెట్టినా
రసజ్ఞుల ప్రశంసల వానలు జోరుగా కొట్టినా
దూషణ భూషణ తిరస్కారాలకు

దూరంగా ఉండగలవారు
ఆత్మవిశ్వాసపు కండగలవారు
కొందరున్నారు లోకంలో
అందులో నేనొకణ్ణి''

తనను గూర్చి కుందుర్తి చెప్పుకునే ఇటువంటి మాటల వెనక ఏ అహంకారమూ, ఏ అతిశయోక్తీ లేదు. వ్యక్తిత్వానికీ, కవిత్వానికీ ఒక సమన్వయం కుదరడం కల్లోల మయమైన ఆధునిక కవితా ప్రపంచంలో ఒక అరుదైన విషయం. కుందుర్తిని గూర్చి చెప్పుకొనేటప్పుడు ముందుగా ఈ విషయాన్ని గమనించాలి. అందుకే, కుందుర్తి ఎవరి గ్రంధాలకి పీఠికలు రాసినా, వ్యాసాలు రాసినా, తన వచనగేయ కవితా సిద్ధాంతాలే విశదీకరిస్తారు. ఏ సిద్ధాంతాల్ని తాను విశదీకరిస్తారో, అవన్నీ తన కవిత్వంలో అనుసరిస్తారు. అందుకే కుందుర్తి పీఠికల్నీ, ఉత్తరాల్నీ, వ్యాసాల్నీ చదివితే, ఆయన కవిత్వపు స్థూల రేఖలు అవగాహన చేసుకోవచ్చు. ఇంక లోతుకు దిగి ఆయన కవితారీతుల్ని పరిశీలించడం విమర్శకుల శక్తిని బట్టి ఉంటుంది.

## కుందుర్తి -వచనగేయం :

సుమారు 1934 నుండి కాల్పనిక సాహిత్యానికి ఎదురు తిరిగి, శ్రీ శ్రీ తన పాశ్చాత్య సాహితీ పరిజ్ఞానసారంతో, సామాజిక వినూత్న శక్తుల ప్రోద్బలంతో, 'మహాప్రస్థానం' గేయాలద్వారా అభ్యుదయ కవిత్వానికి పూర్వ రంగాన్ని సిద్ధం చెయ్యగం ప్రారంభించాడు.

''అధునాతన పాశ్చాత్య సాహిత్యరీతుల ననుసరించడానికీ, భాషను పునఃసృష్టి చెయ్యడానికి ఈయన ప్రయత్నించాడు. పురాతనరీతులనుంచి విడివడి నూతన పధాన్ని అవలంబించి, రానున్న మార్పుకు అంకురార్పణ చేసిన ప్రథముడీయన శ్రీ శ్రీ తో విస్పష్టంగా ఆధునిక యుగం ప్రారంభించిందని చెప్పవచ్చు. ఈ యుగవేదనను, అశాంతిని, విముక్తికై పోరాడుతున్న ప్రగతిశక్తుల సంఘర్షణను తన కావ్యాలలో శ్రీశ్రీ ప్రచండ శక్తితో రూపొందించాడు. ఈయన ధోరణి అనేకులకు మార్గదర్శకమయింది'' (అవసరాల-'' కల్పన ''ముందుమాటలో). 1940 దాకా శ్రీశ్రీ తాను తెచ్చిన కొత్తరీతితో తెలుగు ఆధునిక సాహి

త్వాన్ని సంచలింపజేశాడు. అనేక విధాలైన వినూతన వస్తురీతులకి ఆయన 'మహా ప్రస్థానం'లో బీజాలు వేసినా, అనేక మంది కవులు ఈయన్ని అనుకరించింది శబ్దాలనడక విషయంలోనే. ఒక మహా ఆవేశానికి రూపకల్పనచేసే శైలిని శ్రీ శ్రీ క్రొత్తగా తెచ్చాడు. అది అడుగడుగునా అనుప్రాసల పునరావృత్తితో కూడి, తీవ్రమైన లయతో సాగిపోయే సంస్కృత శబ్ద బహుళమైన శైలి. ఆ శైలి యువ కవుల ఉద్దేశానికి, సమాజములో తీవ్రతరమౌతున్న సంఘర్షణలకీ, వర్గ పోరాట రూపకల్పనకీ సరియైన వాహికగా భావించబడి, వందలాది అభ్యుదయ కవులచేత అనుకరించబడింది. ఆ శైలిచేత, ఆ సామాజిక సంఘర్షణచేతా ప్రభావితుడైన వాడే ఆ నాటి యువకుడైన కుందుర్తి. "ఆ రోజుల్లో కుండపోతగా ఆవేశం కుమ్మరించడమే కవిత్వమనే వాదం మాది. దీనికితోడు ఎర్రజెండా నాయకత్వాన ఈ సమాజ వ్యవస్థ మారాలని మా కవితలో ఉండే సందేశం" ("నయాగరా"- పీఠికలో కుందుర్తి). సాధారణంగా సమాజంలో ఒక సంఘర్షణ జరుగుతున్నప్పుడు, యువ రచయితల హృదయం వెంటనే దానికి ప్రతిధ్వనిస్తుంది. ఆదర్శాల్లో, కలల్లో, భావనాలోకాల్లో బ్రతికే యువకవి, తన జీవితానికో, అనుభవాలకో, ఆదర్శాలకో, అతి సన్నిహితంగా ఆ సంఘర్షణ కనిపించినప్పుడు, ముందు వెనుకలు చూడకుండా ఆ రచనారంగంలోకి దూకుతాడు. నిన్న మొన్నటి విప్లవ రచయితల విషయంలో కూడా యిది సమన్వయిస్తుంది. ఐతే రాజకీయాభిప్రాయాల్లోంచి కవిత్వంలోకి దూకినవారి విషయం వేరు,ఆవేశంలోంచి సంఘర్షణకవితలో దూకిన కుందుర్తి 1944 లో రామదాసూ, ఏల్చూరితో కలసి 'నయాగరా' అనే పోరాట కావ్యాన్ని ప్రకటించాడు. 1941, 42, 43 లలో కుందుర్తి వ్రాసిన మూడు గేయాలు అందులో ఉన్నై. ఈ గేయాల రచనా విధానమంతా శ్రీ శ్రీ ప్రచలితం చేసిన మార్గంలోనే ఉంటుంది.

ఐతే 'నయాగరా' ఆనాటి సంఘర్షణ స్వరూపానికి ఒక స్పష్టమైన రూపాన్ని ప్రతిపాదించి, అభ్యుదయ కవిత్వంకి ఒక మైలురాయిలా నిలిచింది. శ్రీ కె.వి. రమణారెడ్డి చెప్పిన మాటలు ఈ భావాన్ని ధృవపరుస్తై. "శ్రీ శ్రీ కేవలం సిద్ధాంతాన్ని ప్రతిపాదించి, ఆకాశమార్గాలలో ఎవరికీ అందకుండా విహరిస్తుంటే, నయాగరా కవులు భూమ్మీదికి దిగి యిక్కడి పరిస్థితులను అర్థంచేసుకుని వాటికి కావ్యత్వం యిచ్చారు."

కాని, కుందుర్తి వెనుక ముందు చూడకుండా ఉద్యమపు వెల్లువలో కొట్టుకుపోలేదు. దీనికి కారణంగూడా ఆయన తత్వంలోనూ, వ్యక్తిత్వంలోనూ గమనించగలం "తరం తరం" అనే ఫ్రీవర్స్ ఫ్రంట్‌వారు ప్రచురించిన అభ్యుదయ కవితా సంకలనం ముందుమాటలో ఆయన యిట్లా అన్నారు: "నయాగరా రోజుల్లో కేవలం ఆవేశమే కవిత్వమని మా రామదాసూ, సంయమనంతో కూడిన ఆవేశమే కవిత్వమని నేనూ తగాదాపడుతూ ఉండేవాళ్ళం. యిప్పుడు వెనక్కు తిరిగిచూస్తే మా రామదాసు అప్పటి దిగంబరకవి, అప్పటి విప్లవకవి అనిపిస్తాడు. తరువాత తరువాత క్రమంగా భావావేశానికి ఆనకట్టలు వేసుకుని సంయమనాన్ని ప్రదర్శించ గలిగిన వచనకవితే ప్రాచుర్యం పొందింది. "ఈ సంయమనంతో కూడిన ఆవేశమే కుందుర్తి కవితామూలసూత్రంగా చెప్పవచ్చు. 1944 నయాగరా కవిత తర్వాత, సుమారు 1950 కాగా ఆయన ఆవేశమూ, సంయమనమూ ఘర్షణపడి ఆయనలో వినూతన వచన కవితాశైలికి వేసిన బీజాల్ని "వేకువ వెలుగులు" అనే గేయాల్లో మనం చూడగలం. వీటిల్లో మాత్రాచ్ఛందస్సుల్ని చీల్చుకు ముందుకు సాగుతున్న వచనగేయాల లయల్నీ, నినాదవీధుల్నీ, భావుకతతో విశాలంచేస్తూ పురోగమిస్తున్న భావనారీతుల్నీ, సంస్కృత అనుప్రాసల మార్గశైలిని ఛేదిస్తూ వ్యావహారిక దేశిపదప్రాచుర్యానికి తిరిగే మలుపుల్నీ స్పష్టంగా గమనించగలం. ఈ "వేకువ వెలుగులు" 1950లలో వచన కవితలో తన బాట తాను నిర్మిస్తూ పురోగమిస్తున్న కుందుర్తి సూర్యుడికి నిజంగా "వేకువ వెలుగు"లే. ఉదా:-

"పొరుగు సోదరుడూ, నువ్వూ పోడుచుకునే దానికి ముందు
మీ యిద్దరి చేతులకుండే సంకెళ్ళను తెంచుకోండి!
మనం మనం బాగానే ఘనంగా కొట్టుకోగలం
కాని మిలటరీ రాగానే కలకాలపు శత్రువుకే బలం!
కార్మికులకు మత మేమిటి? కర్షకులకు మతమేమిటి?
జగతి వక్రగమనంలో రకరకాల పీడితులకు
అణగారిన కోటి కోట్ల మానవులకు మత మేమిటి?"

మాత్రాచ్ఛందస్సుకూ, వచనగేయానికీ జరిగే ఘర్షణా, శ్రీశ్రీ నాటినుండి స్థిరపడ్డ నినాదాలకీ, కొత్తనుడికారాలకీ జరుగుతున్న సమ్మేళన ప్రైపంక్తుల్లో గమనించ

వచ్చు. పోగా పోగా 1949 లలోకి వచ్చేటప్పటికి వచనగేయ శైలి, భావుకతా ఎట్లా రేకులు విప్పుకొంటున్నవో గమనించవచ్చు.

"కాలంవలె నిత్యమైన మానవుడా!
దారి పక్క పూరి గుడిసె కాలుతోంది
వటవృక్షం కూలుతోంది
అర్ధరాత్రి పెనుతుఫాను ఓడలు ముంచేస్తున్నది
పట్టపగలు పచ్చిదగా బ్రతుకులు ముంచేస్తున్నది
చీకటి వెన్నెలలా ముఖాన సున్నం పూసుకుంది
నాగరికత చొక్కా తొడుక్కుంది
లే లే, నిరోధించు, నీ కర శృంఖల త్రెంచు"

సుమారు 1953 ప్రాంతంలో కుందుర్తికి, తనదైన, ఒక సర్వసమగ్రమైన ఒక వచన కవితా శైలి ప్రసన్నమైనట్లు గోచరిస్తుంది. కవితా వస్తువు నినాద సిద్ధాంత సూత్ర ఆవేశ పరిధుల్ని చీల్చుకుని, విశాల సామాజిక స్పృహని పండించిన లక్షణం కనిపిస్తుంది. తాను తెలుస్తున్న సరికొత్త సామాజిక వచన కవితా ధోరణికి ఉద్యమ రూపాన్నిచ్చే లక్ష్యం కూడా దాదాపు అప్పటినుంచే ఆరంభమైనట్లు మనం ఊహించవచ్చు. ప్రణయ కవిత్వం మీద ఒక మృదువైన అవహేళనగా వ్రాసిన "ప్రేమలేఖ" లో యిట్లా అంటాడు:

"ప్రియా!
ప్రేమికుల వేడికన్నీళ్ళు గడ్డకట్టినై
ఈ కొత్తకవిత చలికి-
ధర్మంలా కవితా ధర్మంకూడా చెడితే
ఆనందంగా వుంది కలికి!"

సుమారుగా 1953 నుండి, వచన కవిత్వానికి ఒక ఉద్యమ స్వరూపాన్నిచ్చి, తనకు తానుగా తన మార్గం సామాజిక అభ్యుదయ వచన గేయంగా నిలబడ్డాడు కుందుర్తి. "అడుగుజాడ గురజాడదీ" అనే అభ్యుదయ కవితా సంకలనపు ముందుమాటలో శ్రీ కె. వి. రమణారెడ్డి అన్న యీ మాటలు చూడండి-

"శ్రీ శ్రీలో చిలకేటుగా మాత్రమే కనిపించే ఈ ముక్తచ్ఛందో

ప్రయోగాలకు స్ఫూర్తినీ, మూర్తినీ కల్పించింది ముఖ్యంగా బాలగంగాధర తిలక్, కుందుర్తి ఆంజనేయులుగార్లు.''

**కుందుర్తి-వచనగేయ ఉద్యమం :**

''పాతకాలం పద్యమైతే
వర్తమానం వచనగేయం''

కుందుర్తి వచన గేయ రచనని ఒక ఉద్యమంగా భావించినవాడు. పాతరీతులమీద తిరుగుబాటునీ, సామాజికంగా వస్తున్న మార్పునీ, కవితలో కలుగుతున్న నూతనమైన పోకడల్నీ, నిరంతర స్పృహగా చేసికొని కవిత్వం రాస్తున్నవాడు. ఈ నూతనత్వ స్పృహ ఆయన రచనల్లో చాలా తరుచుగా కనిపిస్తుంది.

"తెలుగు సాహిత్యంమీద ఈ నవయుగ ముద్ర
యింతవరకు పడలేదు గదా
అందుకే అస్మదాదులం ఏదో క్రొత్తను వెదుకుంటూ
యిలా కాలం గడుపుకుపోతున్నాం''

చాలాచోట్ల వర్ణనల్లో గూడా నూతనత్వ ప్రసక్తిని తెచ్చి అలవోకగా ప్రస్తుత భావంతో మేళవిస్తాడు.

ఈ వచన గేయ కవితారచనాస్పృహ కుందుర్తిలో ఒక నిరంతర చైతన్యం. ఇది ఉద్యమకారునికి కావలసిన లక్షణం అట్లాగే ''ఫ్రీవర్స్ ఫ్రంట్'' స్థాపించి వచనగేయ వ్యాప్తికోసం తన కవితా చైతన్య మంతటినీ అంకితం చేసినవాడు కుందుర్తి. ఉద్యమ స్థాయిలో వచన కవితనుగూర్చి ఆయన ప్రస్తావించడాన్ని కొంతమంది అపార్థం చేసుకున్నారు- కేవలం కవితారూపాన్నే ప్రధానం చేసుకుని, వస్తువుని గూర్చి విస్మరిస్తున్నాడేమో అని. కాని, కుందుర్తి అభిప్రాయం వేరు. నేటి కవి సమాజాన్ని ప్రతిబింబించాలనీ, అభ్యుదయ భావాల్ని ప్రకటించి సామాన్యుల్ని ఉత్తేజితుల్ని చెయ్యాలనీ, అభ్యుదయ కవితాయుగ ప్రారంభంనించి స్థిరపడిపోయిన సత్యం. శ్రీ ఎన్. గోపి వ్రాసిన "తంగెడు పూలు" కావ్యానికి పీఠిక రాస్తూ కుందుర్తి అంటారు-

''ఏం చెప్పాలి, ఎలా చెప్పాలి అనే రెండు విధానాలలో నేను మొదటి దాని పట్ల మొగ్గుచూపే స్వభావం కలవాణ్ణే. అయినా కేవలం దీనిమీదనే

7)

దృష్టి పెట్టుకుని కాలహరణం చెయ్యాల్సిన రోజులు గడిచిపోయాయనీ, రెండవ దానికి కూడా ప్రాధాన్యం యివ్వవలసిన తరుణం వచ్చిందనీ అనుకుంటాను.''

కాబట్టి, వచన కవితా రూపం అభ్యుదయ వస్తువుని చాలా శక్తిమంతంగా, ప్రజలలోకి వెళ్ళే రీతికి చెప్పగల ఈ యుగవాహిక అనీ, ఆ రూపంలో ఎంతో శిల్ప వైవిధ్యాన్నితెచ్చే అవకాశాలు న్నాయనీ, ఆ అవకాశాలన్నీ వినియోగించుకుంటే, ప్రజా కవితగా వచన కవిత యింకా సమగ్ర మౌతుందనీ కుందుర్తి వాదం.

ఐతే, ఈ తిరుగుబాటును నిర్వహించి ప్రచారం చెయ్యడంలో కుందుర్తి పద్ధతి విశిష్టమైంది. వచన కవితను ద్వేషించే సాంప్రదాయికుల్ని దూషించి, ముందుకు దూసుకుపోయే విధానం కుందుర్తికి నచ్చలేదు. సాంప్రదాయికుల్ని కూడా మనస్ఫూర్తిగా ఒప్పించే సాత్వికమైన ప్రచార పద్ధతిని కుందుర్తి అవలంబించాడు.

కుందుర్తి కవితకి సాంప్రదాయిక ముద్ర బాగానే ఉంది. అంతేగాక కావాలని సంప్రదాయాన్ని నిందించకుండా ప్రశంసించడం కూడా ఆయనలో చూడగలం. 1962లో ''అడుగుజాడ గురజాడది'' అన్న అభ్యుదయ కవితా సంకలనం ప్రకటించిన శ్రీ కె. వి. రమణారెడ్డి కుందుర్తి అభిప్రాయాన్ని ఉదాహరిస్తూ, ఆనాటి పరిస్థితిని యిట్లా చెప్తాడు:

''నియమ బద్ధమై, నన్నయాదులచేత తీర్చిదిద్దబడిన పద్యం మాకు తల్లి. దానిని కించ పరచాలనే ఉద్దేశం లేదు. పద రచయిత లొకవేళ గేయాన్ని తూలనాడినా, ఒకవేళ ఎందుకు? తూలనాడడం తథ్యం- మేము పద్యాన్ని ఏమనేది లేదు. కాని తెనుగు కవిత్వానికి పద్యమే, వృత్తమే తుదిస్వరూపమని మాత్రం అంగీకరించం." (యుగేయుగే: పాఠకుల్తో పది నిమిషాలు)

"సామాన్యులు ఇప్పటికీ గేయాన్ని సమాదరించ లేకున్నారు. గేయమైనా అరాకొరా గుర్తింపు పొందగలిగిందేమోగాని, వచన గేయం యింకా వెలిబడి ఉంది.''

అందుకే కావాలని కుందుర్తి తన ప్రతి సంపుటిలోను పద్యాల్ని కూడా చేరుస్తాడు. పద్యాన్ని గూడా యింత బాగా రాయగలిగిన కుందుర్తి, వచనగేయ పంథా ననుసరించాడంటే, యిందులో ఏదో సమకాలీన తత్వం ఉందని సాంప్ర

దాయికుల్ని కూడా ఆలోచించేటట్లు చెయ్యాలని కుందుర్తి అభిప్రాయం. పాత రీతిమీద తిరుగుబాటు ప్రకటించేటట్లు కుందుర్తి ఎంత సంయమన శీలాన్నీ, సాత్వికతనీ ప్రకటిస్తాడో ఒక్క ఉదాహరణ చూడండి-

సంప్రదాయాన్ని మన్నించడ మంటే
సమస్తం అనుకరించడం కాదు
అవసరం లేని అనేక బంధాలను కావాలని కసికరించడం కాదు
క్రొత్తను 'కొందరు' ద్వేషించడం కద్దు
అయినా పాత మా పునాది
నన్నయ్యనుండి నాదాకా తెలుగు కవిత అంతా నాది''

సాంప్రదాయిక మార్గాన్ని గౌరవిస్తూనే, మారుతున్న సాంఘిక పరిస్థితులకీ, సంఘర్షణలకీ వచన గేయమే సరియైన వాహిక అని చేసే ప్రచారం ఆనాడు చాలా అవసరం. వచన గేయం బాగా స్థిరపడి బహుళ జనాదరణీయం కావడానికి, సామాజిక పరిస్థితుల్ని ప్రతిబింబింపచేస్తూ సమాజాన్ని కదిలించే వాహికగా రూపొందడానికీ, మార్పు పొందే కాలంతో బాటు కుందుర్తి మొదలైనవారి సమన్వయ పూర్వక సాత్త్విక ప్రచారం కూడా చాలా దోహదం చేసి ఉంటుందని ఈనాడు మనం ఊహించుకోవచ్చు.

కుందుర్తి మొదటి నుండీ అభ్యుదయ రచయితల శాఖకి చెందినవాడు. అభ్యుదయ కవితా విమర్శకులు మొదటి నుండీ సాహిత్యంలో, సామాజిక పురోగమనంలో చాలా విశాల పరిధిని అంగీకరించారు. కేవలం గెరిల్లా గీతాలు రాసిన గంగినేని నుండి, కాల్పనికతాచ్ఛాయలతో గూడి సామాజిక చైతన్యం ప్రోత్సహించిన బాలగంగాధర్ తిలక్ దాకా అభ్యుదయ కవులుగా పరిగణింపబడ్డారు. కుందుర్తి ప్రారంభం నుండి తన కవితను ప్రజాభ్యుదయ సామాజిక భావాలకే అంకితం చేసినవాడు. సామాన్యుణ్ణి దైనందిన జీవన ఘర్షణల్లో మేల్కొలపడమే ఆయన అచంచల లక్ష్యం. తాను 'యుగేయుగే'లో అంటాడు:

''చరిత్ర ఒడిదుడుకుల నడకకు వచ్చిన అపాయాన్ని
సమతా సమాజ సాధనకు ప్రజాబలం చెప్పిన ఉపాయాన్ని
జాతికీ అవినీతికీ జరిగే సంఘర్షణ సముదాయాన్ని
వర్ణిస్తాను, బ్రతుకు పోరాటాల నికరాదాయాన్ని''

ఐతే. అక్కడక్కడ అతిస్వల్పంగా రేఖామాత్రంగా కాల్పనిక, వేదాంతాది చ్ఛాయలు గోచరించినా, ఆయన కవితా ప్రధానలక్ష్యంలో వాటికున్న విలువ సింధువులో బిందువంత మాత్రమే అని చెప్పవచ్చు. ఆయన సాంప్రదాయికంగా చెప్పిన కొన్ని భావాల్ని ఊతగా చేసుకొని ఆయనలోనించి ఒక సంపూర్ణ ప్రాచీన వేదాంత భావనారీతిని ఆవిష్కరించిన విమర్శకులున్నారు. అది సరియైన విమర్శ అని నేననుకోను. ఎందుకంటే - ఒక రచయిత రచనా ప్రేరణల్ని అన్వేషించే సమయంలో, మధ్యలో ఎక్కడో రేఖామాత్రంగా కనిపించే భావాల్ని పెంచి, మన భావన కనుగుణంగా, అందులోంచి ఒక భావనాలోకాన్ని ఊహించడం కవికి న్యాయం చెయ్యదనుకుంటాను.

కుందుర్తి సామాజిక స్పృహ పరిధి చాలా విశాలమైంది. బుద్ధుణ్ణీ, గాంధీని ప్రశంసిస్తూ, వైయక్తిక నీతిని పెంపొందించుకోవడం నించి ("మనిషి ఇంకా ఉండాలంటే మనసు పండాలి") తెలంగాణా ఉద్యమంలో వర్గపోరాటం దాకా కుందుర్తికి రచనావస్తులే. సమాజంలో ఉన్న ఆకల్నీ, దరిద్రాన్నీ, అవినీతిని, అసంతృప్తిని, బ్రతుకుపోరాటాన్ని వర్ణించడానికే తన కలాన్ని అంకితం చేసినవాడు. ముఖ్యంగా తనచుట్టూ, తన అనుభవంలో ఉన్న సామాజిక రాజకీయ వేదనకు అక్షర రూపాన్ని కల్పించినవాడు. తనకి అనుభవానికి రాని విషయాల్నో, సిద్ధాంతాల్నో వ్యామోహంచేతగాని, ఇమేజికోసంగాని, వ్యతిరేక విమర్శలకి లొంగి, మనసు చంపుకొని వర్ణించినవాడు కాదు. ఇక్కడే కుందుర్తి చిత్తశుద్ధి ఉంది.

లోతుగా ఆలోచిస్తే సమాజంయొక్క పురోగమనాన్ని నిర్ణయించేది ఆర్థిక ఉత్పత్తి సంబంధాలు, అవి సమాజంలో వర్గాల్నీ, వైరుధ్యాల్నీ సృష్టించి, సామాజిక రాజకీయ సమస్యలన్నింటికీ మూలకారణమవుతై. ఆర్థిక కారణాలు మూల బీజం కాగా, సమాజంలోని వైరుధ్యాలు, ఆకలి, అజ్ఞానం, అసమానత మొదలైనవన్నీ ఉపరితల నిర్మాణం (Super-structure). దోపిడీ చేసేవాళ్లు అనేక విధాల దోపిడి చేస్తుండగా, దోపిడి చెయ్యబడే ప్రజలు అనేక సమస్యలకు గురి ఔతూఉంటారు. ఈ సమస్యల్ని వర్ణించడమే సామాజిక వాస్తవికత(Socialist Realism) ఔతుంది. స్థూలంగా ఇది మార్క్సిస్టు సూత్ర పరిజ్ఞానంచేత దేశంలో పెంపొందిన సాహిత్య పరిణామం. అప్పటినుండే 'సామాన్యుడు' సాహిత్యంలో

ప్రధాన స్థానం వహించాడు. మనిషిని సామాజిక పరిస్థితుల్నుండి వేరుగాక సమాజ యంత్రంలో సీలగా పరిగణించడం, భౌతికవాద పూర్వకంగా సామాన్యుడెదుర్కొనే వైరుధ్యాలు చిత్రించడం, చారిత్రకదృష్టి ప్రధానంగా కలిగి ఉండటం, శాస్త్రీయ పురోగమన దృక్పథం కలిగిఉంగటం సామాజిక వాస్తవికతలోని ముఖ్యాంశాలు. సామ్రాజ్యవాద నిరాకరణ, శాంతి ప్రియత్వము, యుద్ధవిముఖత, పెట్టుబడిదారీ వ్యవస్థావైముఖ్యమూ - ఇవన్నీ అభ్యుదయ రచయిత దృష్టిలో పెట్టుకోవలసిన అంశాలుగా పరిగణింపబడ్డై. ఈ విషయాల దృష్ట్యా కుందుర్తి సంపూర్ణ అభ్యుదయ కవిగా దర్శనమిస్తాడు. సమస్యలతో సతమతమయ్యే సామాన్యుడే ఆయన కవిత్వానికంతటికీ నాయకుడు. 'యుగే యుగే' ప్రారంభంలోనే యిట్లా చెప్తాడు:

"ఇది నా కవిత్వం గీత, వినేవాడు నరుడు
చదువూ సంధ్యలు రాని రోడ్డు మీద పామరుడు
శేమితల్లి ఒడిలో నిరంతర గాఢనిద్రాపరుడు"

* * *

"పనిపాటలు లేక బ్రతుకు జరగని కూలీల పేటను
ప్రతి యింటిలో తిండిలేని పూటను
ప్రభుత్వాలు సరదాగా చేసే మనుషుల వేటను
వర్ణిస్తాను, బ్రతుకు బాధల ముళ్ళబాటను."

ఐతే, యిన్ని అంశాలతో గూడిన దృక్పథ వైశాల్యం నశించి, రాను రాను, మార్క్సిస్టు కవిత్వం అంటే కేవలం వర్గచైతన్యానికీ, సంఘర్షణకీ అంకితమై తీరాలనే ఒక నినాదం కొందరు రచయితల వర్గాల్లో ప్రథమ స్థానం ఆక్రమించడం జరిగింది. దాంతో ఈ సమాజ వైరుధ్యాలకి "పరిష్కారం" కవి చెప్పాలి అనే నినాదం ప్రాధాన్యం వహించింది. అక్కడ కుందుర్తిలాంటి అభ్యుదయ రచయితలందరికీ అభిప్రాయ భేదం వచ్చింది. కుందుర్తి సామాజిక స్పృహ, గాంధీ చేసిన దండియాత్ర దగ్గరనుండి, బుద్ధుడు బోధించిన శాంత్యహింసల నుండి, తెలంగాణా పోరాటంలో జరిగిన భూపోరాటం దాకా వ్యాపిస్తుంది. సామాజిక పురోగమనాన్ని సూచించే, సంఘాన్ని ముందుకు నడిపించే ఏ విధమైన ప్రజాపోరాటానికీ ఆయన విముఖుడు కాదు. ఎంత చిన్న ఫలితం కలిగినా సరే, ఆ పోరాటాన్ని ఆయన సమర్థిస్తాడు. ఉదయం లేవగానే వర్గరహిత సమాజం

వచ్చెయ్యాలి- అన్న ఒక్క సిద్ధాంతాన్నే గాక, చారిత్రకంగా సమాజ పురోగమన క్రమంలోని ప్రతి చిన్న అంశమూ ఆయన హృదయాన్ని కదిలిస్తుంది. "ప్రజల్ని చైతన్యవంతుల్ని చేసి. ముందడుగు వేయించాలి కవిత్వం. ఆ చైతన్యంలోనించి వచ్చే పోరాటారూపాలు వారిలోంచే బహిర్గతం కాగలవు" అనేది కుందుర్తి సిద్ధాంతం. ఈ నాటి ప్రజాకవికి అత్యవసరమైన సిద్ధాంతం యిదేనని నా అభిప్రాయం. ప్రజాజీవిత వైరుధ్యాల్ని విస్మరించి, ఒక్కసారి వర్గరహిత స్వర్గాన్ని నినదించే కవి, ప్రజలకి దూరం కావడం తప్పనిసరి. ఇక్కడ కుందుర్తి తనకు తానుగా చెప్పిన కొన్ని మాటల్ని పునరుద్ధరించడం అప్రస్తుతం కాదు.

"అభ్యుదయ కవులందరూ పార్టీలలో సభ్యులు కారు. మార్క్సిజానికి సంబంధించిన ఊహలు వారికి ఉండవచ్చు, అందులోని కరుణావాదానికి మాత్రమే వారు బద్ధులై, మిగిలిన పార్టీ వ్యవహారాలకి దూరంగా ఉండవచ్చు. అభ్యుదయ కవి కావడానికి ఆ మాత్రం చాలు. సమకాలీన సమాజ స్పృహతో కూడిన రచనలు చేసేవారు, పురోగామి దృక్పథం కలవారు అందరూ అభ్యుదయ కవులే." సామాజిక సమస్యల పరిష్కారానికీ, కవికీ ఉండవలసిన సంబంధాన్ని గూర్చి మరోచోట ఇట్లా అంటారు :

"మార్క్సిస్టు దృక్పథంతో సామాజిక పరిస్థితులను అవగాహన చేసుకుని, అంచనా వేసుకుని, ఆ యా కాలాలలో ఏయే కార్యక్రమాలు అమలుపరచడం ద్వారా నేటి నిర్జీవ సాంఘిక వ్యవస్థను మార్చవలెనో తేల్చుకోవలసిన ప్రధాన బాధ్యత రాజకీయవేత్తది. వారు చేసే కృషికి దోహదకరంగా రచన చేస్తూ, అభిప్రాయాలు ప్రకటిస్తూ, ప్రజలలో భావవిప్లవం రావడానికి కృషిచేస్తూ, వారిని విప్లవోన్ముఖులుగా తయారుచేయడం ఈ నాటి కవియొక్క బాధ్యత. స్థూలంగా ఇదీ నా దృష్టి."

ఈ మాటల్లో "విప్లవోన్ముఖులు" అనే పదానికి మార్క్సిస్టు సాయుధ పోరాటంఒక్కటే అని, కుందుర్తి రచనలన్నీ బాగా పరిశీలిస్తే, వ్యాఖ్యానించలేము. సమాజాన్ని ముందడుగు వేయించే ఏ విధమైన పోరాటమైనా ఆయన 'విప్లవ' పరిధిలోకి వస్తుంది (సాయుధ పోరాటంకూడా). కాబట్టి, ప్రజల్ని, సామాన్య ప్రజల్ని, తమ సమస్యలకు మేలుకుని ఉండేటట్లు చెయ్యడమే కుందుర్తి సామాజిక స్పృహలోని ప్రధానాంశం. మొదట్లో మార్క్సిస్టులే, ఈ సామాజిక వాస్తవికతని

ప్రచారంచేసి, గురజాడని నాయకుడుగా, శ్రీశ్రీని తత్త్వవర్తకుడుగా గుర్తించి, అభ్యుదయ కవిత్వాన్ని, కేవలం పార్టీ నినాదంగాకుండా, వ్యాపింపజెయ్యడం వల్ల, కుందుర్తి, ఆ విశాల పరిధిలో మార్క్సిస్టుల అభ్యుదయ ధోరణిని పూర్తిగా జీర్ణింపజేసుకుని, పార్టీతో నిమిత్తం లేకుండా, ప్రజాచైతన్యాన్ని సర్వ విధాలా వెదజల్లిన తిరుగుబాటు కవి. ఇండో-ఆంగ్లియన్ సాహితీపరుల్లో ఇటీవల బాగా ప్రచారం సాధించిన "Poetry of Protest" అనే పదానికి కుందుర్తి చాలా సమగ్రమైన ఉదాహరణ కాగలడు.

Bhishau Sahni తిరుగుబాటు కవినిగూర్చి చెప్పినమాటలు చూడండి. "His sensibilities react sharply to the contradictions in social life and he interprets life invariably in terms of those contradictions. He may take a detached View and Portray life in a gently ironical matter; or he may lash out at social institutions with angry satire; or he may feel so involved as to expose the existing evils with the zeal of a crusading reformer; or he may be so disillusioned that he may Portray life in terms of utter disbelief and dispair. The element of protest is present, more or less, in all of them. Further, there is always a struggle for the future going on in society and we invariably find the writer on the side of the renascent forces and opposed to all that is decadent and moribund in society."

ఈ మాటల్లో ప్రత్యక్షరం కుందుర్తిగారి కన్వయిస్తుంది.

సామాజికమైన తన తిరుగుబాటును, వేదనను వ్యక్తంచేసే పద్ధతులు అనంతంగా ఉంటై కుందుర్తిలో. కేవలం పరిష్కార సంబంధమైన కవిత్వాన్ని కుందుర్తి మేలైనదిగా ఎంచకపోవడంలో ఒక ముఖ్య కారణము - వచనగేయంలో అనంతమైన శిల్పం ప్రదర్శించదలచిన కవికి అక్కడ అవకాశముండదు. ఒక సిద్ధాంతాన్ని, ఒకే నినాదాన్ని నిరూపించే కవితలో భావ వైవిధ్యం, శిల్పవైవిధ్యం

ప్రదర్శించి ప్రజల జీవితాలకి అతి దగ్గరగాపోయే అవకాశం చాలా తక్కువై పోతుంది.

## కుందుర్తి – సాంప్రదాయికత:

అభ్యుదయ సామాజిక రచయిత, ఫ్యూడల్ విశ్వాసాల్ని విసర్జించి, భౌతికవాదిగా ఉండాలనడం చాలా సహజమైన విషయం. సాంప్రదాయిక భావా లకి ఎదురు తిరిగి ఆధునికతను స్థాపించబూనిన అభ్యుదయ కవిలో సాంప్రదా యికమైన భావాల్ని, సాంప్రదాయిక చిహ్నాల అవశిష్టాల్ని చూచినప్పుడు ఆశ్చర్యం కలుగుతుంది. ఈనాడు పెంపొందిన ఆధునికతదృష్ట్యా ఆనాటి అభ్యు దయ కవుల్ని విమర్శించడం, చారిత్రక పరిస్థితుల్ని విసర్జించిన అతివాదమే ఔతుంది. ఈనాడు, ఆధునిక కవితని చెప్తున్న కవిగూడా చాలావరకు సాంప్ర దాయికమైన ఇమేజిలను వదిలిపెట్టేశాడు. కాని కాలాన్ని బట్టి మొదటి వరుసలో నిలబడ్డ అభ్యుదయ కవులు చాలామందికి ఈ సంప్రదాయిక భావ ప్రభావం చాలా అధికంగానే కనిపిస్తుంది. వాళ్ళు సంప్రదాయంలో పుట్టి, సంప్రదాయంలో పెరిగి, నరనరాన సంప్రదాయాన్ని జీర్ణింపజేసుకుని, దాంట్లోంచి ఆధునిక భావాల్ని మథించి వెలికి తీయడానికి కృషి చేసినవాళ్ళు. ఈనాడు అశ్రమంగా ఒక యువకుడు చెప్పగలిగిన ఆధునిక భావానికి, ఆనాటి కవికి, లోకంలోనూ, అంతర్లోకంలోనూ అపూర్వ సంఘర్షణ ఉండి ఉంటుందని మనం ఈనాడు తేలిగ్గా ఊహించుకోవచ్చు. ఆ మొదటి వరుస అభ్యుదయ కవులలోనూ, కుందుర్తిలో ఈ సాంప్రదాయికత చాలా ఎక్కువగా కనబడుతుంది.

సాంప్రదాయికమైన భావాల్ని, చిహ్నాల్ని, సాహిత్యముద్రల్ని వినియో గించడంలో కుందుర్తి Conscious Artistగానే చేశాడనిపిస్తుంది. దీని వలన ప్రధానంగా ఉన్న ప్రయోజనాలు రెండు. మొదటిది – వాటివల్ల సాహిత్య పరమైన ఒక బలాన్ని తన భావాలకి శిల్పరూపాన అందించడం. అంటే, ప్రాచీనతాముద్ర కవితాశిల్పానికి అంగంగా మారిపోవడం. ఒక్క ఉదాహరణ చూడండి- "షష్ఠ్యంతాలు" అనే కవితలో సాంప్రదాయిక రచనారీతిని శిల్పంగా మలచుకొన్న రీతి బాగా కనిపిస్తుంది. ఇది మనదేశంమీదికి వచ్చిన శత్రువులని జయించడానికి దేశీయుల్ని ప్రోత్సహించే రచన.

"చెప్పేదానికి చేసేదానికి పీసంపోలిక లేనివానికి
సభ్యతా సంప్రదాయాల జోలికి వచ్చినా పోనివానికి......"

మొదలైన విధంగా ''షష్ఠీవిభక్త్యంతంగా'' 26 పాదాల్లో శత్రువు దుర్లక్షణాలు తీవ్రంగా వర్ణించి, చిట్టచివరకు ''వ॥'' (పూర్వకావ్యాల్లోమాదిరి వచనం) అని పెట్టి ప్రక్కనే "అఖిలాపజయ పరంపరాభివృద్ధిగా నా జాతి యొనర్పంబోవు ''దెబ్బకు దెబ్బ'' యను మహా గణ ప్రబంధమున అరివధాక్రమంబెట్టిదనిన'' అని గేయాన్ని ముగిస్తాడు. ఈ గేయంలో ఎంత బలంగా సాంప్రదాయిక సాహిత్య విధానాన్ని వినియోగించుకున్నారో చూడవచ్చు.

అట్లాగే చాలా భావాల్ని పరాకాష్ఠలో చెప్పడానికి సాంప్రదాయికమైన Symbols ఈ నాటికీ సామాన్యుడిలో పుష్కలంగా ఉన్నై. ఒకరిమీద ఉన్న స్నేహాన్ని ఎంత విపరీతంగా చెప్పడానికి ప్రయత్నించినా ''యిది ఎన్ని జన్మల బంధమో" అనే మాటకి ఉన్న బలం రాదు. అట్లా అన్నవాడు విధిగా పునర్జన్మల్ని నమ్మితీరతాడని చెప్పే అవకాశం లేదు; అట్లా భావాలకి బలం తేవడానికి సాంప్రదాయికమైన Symbols యొక్క అంతు చూసినవాడు కుందుర్తి. ఉదాహరణకి ''భగవంతుడికి బహిరంగలేఖ'' చూడవచ్చును. దేవుని పేర జరిగే అన్యాయాల్నీ, మనిషే ఈనాటి దేవుడనే సత్యాన్నీ దేవుణ్ణి గుడ్డిగా నమ్మిన సంస్కృతికీ, మానవుణ్ణి దేవుడుగా నమ్మిన సంస్కృతికీ ఉన్న భేదాల్నీ, దేవుణ్ణి సమాజాన్నీ యిష్టంవచ్చినట్లు తిట్టే కవి కన్నా, కుందుర్తిధోరణిలో చెప్పినకవి, ఎక్కువ Convince చెయ్యగలడు. సామాన్యునిలో సహజంగా సామాజికమైన దోపిడి అర్థంకావాలనుకునే ఉద్యమకారుడు ఈ మార్గాన్ని అవలంబిస్తే ఫలితం ఎక్కువగా ఉంటుంది. భగవంతుణ్ణి సమాజాన్నీ తిట్టే తిట్లు, అవే భావాలు తీవ్రంగా కలిగి, ఆ దిశలో బాగా ముందుకు పోయిన పాఠకుని హృదయానికి ఆనందం కలిగిస్తై. కాని, కుందుర్తి ధోరణి, సామాన్యునిలో కావలసిన మార్పుకి బాగా దోహదం చేస్తుంది. సామాన్యుణ్ణి లక్ష్యంగా పెట్టుకున్న కుందుర్తికి (అందులో ఆ నాటి అభ్యుదయ కవుల వరసలోని వానికి) ఈ ధోరణి మంచి ఫలితాన్ని సాధించిపెట్టగలదు. ఉదాహరణ చూడండి:

''నీకూ నాకూగల మైత్రి లోకానికి తెలియకపోయినా
నీకూ నాకూగల అంతరం లోకానికి తెలియంది కాదు
యుగయుగాలు గడిచినా మారవు నువ్వు
నేను మార్పును కోరేవాణ్ణి: దానికోసం పోరేవాణ్ణి:

పాపపుణ్యాల త్రాసుపట్టుకొని పిసినిగొట్టు అంగడి సెట్టిలా
నీవు విలువలు తూస్తావు
నేను మనిషి వైపు మొగ్గు చూపిస్తాను...
తను తప్పు చేస్తూ శివశివా అని
నా కండ్లు మూసే యోగి, నీకు వాడు మహాభక్తుడు
నేను వాణ్ణి సహించను-
ఇంట్లో జరిగే ఇబ్బంది ప్రతిదాని వెనకాల
నీ రహస్య హస్తం కనిపిస్తుంది-''

కుందుర్తి, యీ సాంప్రదాయిక ధోరణిలోని రెండో మహా ప్రయోజనం తాను తలపెట్టిన సామాన్యుల వస్తువుకి, సామాన్యుల భాషకి, అభ్యుదయోద్యమానికీ, సంప్రదాయాన్ని విశ్వసించే సామాన్యుల్లో కూడా తెలియని మార్పుని తీసుకు రావడం. అందుకే ఆయన ఒకచోట తాను రాసిన పద్యాల్ని గూడా వచన గేయాల మధ్యలో చేర్చి, యింత మధురంగా పద్యరచన చెయ్యగల కుందుర్తి గూడా వచనగేయాన్ని ఆశ్రయించడంలో ఏదో ఉత్తమ ప్రయోజన ముంటుందని ఆలోచింప చెయ్యడమే తన ధ్యేయం అంటారు. కాబట్టి కావాలనే తాను ఈ సాంప్రదాయికతానుసరణాన్ని చేబట్టారు: మొగ్గని చిందర వందర చెయ్యడానికి తొందర పడకుండా, పూవుగా నిదానంగా, సహజంగా మార్చే ఉద్యమ స్వభావునికి ఈ విధానమే అనుసరణీయం. అందుకు తగ్గ సాత్వికత, సంయమనం, చిత్తశుద్ధి కుందుర్తిలో ఉన్నవని చెప్పడం పునరుక్తి ఔతుంది. ఐనా కుందుర్తి కృతులు, జాగ్రతగా పరిశీలించిన వారికి మరొక సత్యం కనిపిస్తుంది. రానురాను, ఆయనలో ఉన్న సంప్రదాయిక చిహ్నాలు గూడా కాలానుగుణంగా తగ్గిపోతూ వచ్చినై. మారుతున్న సమాజాన్ని బట్టీ, వాటి అవసరం యొక్క అధికతా అల్పతల్ని ఎప్పటికప్పుడు ఆయన అంచనా వేసు కున్నాడనిపిస్తుంది- ఆలోచితంగా గాని, అనాలోచితంగా గాని.

## కుందుర్తి-ఆత్మాశ్రయత్వం :

ఆత్మాశ్రయత్వం భావకవిత్వానికి పర్యాయ పదం. కవి తనను గూర్చి, తనలోని అనుభూతుల్ని గూర్చి మాత్రమే లోకానికి తెలియజేస్తాడు. ప్రతి చోటా ''నేను-నా బాధ'' కనిపిస్తుంది. భావకవిత్వాన్ని సామాజికంగా నిరుప

యోగమనీ, పెట్టుబడిదారీ వ్యవస్థ విషఫలితమైన వ్యక్తిగత గందరగోళమని గుర్తించిన అభ్యుదయ వాదులు, ఆత్మాశ్రయత్వాన్ని తీవ్రంగా వ్యతిరేకించి, సమూజాశ్రితమైన కల్లోలాన్ని వర్ణించడం ధ్యేయంగా భావించారు. ఐతే, అప్పుడప్పుడే భావకవితా గర్భాన్ని చీల్చుకు వస్తున్న అభ్యుదయ కవుల మొదటి వరుస కవులలో, ఆత్మాశ్రయత్వ చ్ఛాయలు బాగానే గోచరిస్తై. తామేదో ఒక వినూతన ధోరణికి కవిత్వాన్ని మలుస్తున్నామనే స్పృహ వారిలో ప్రతి ఒక్కరిచేతా, తాను తెస్తున్న విప్లవాన్ని గూర్చి అభివర్ణించేటట్లు చేసింది

''ఆకాశపు దారులంట హడావుడిగ వెళ్లిపోయే
జగన్నాథ రథచక్రాలను భూమార్గం పట్టిస్తాను
భూకంపం పుట్టిస్తాను''(శ్రీ శ్రీ)
''నాయీ వచన పద్యాల దుడ్డు కర్రలో
పద్యాల నడుముల్ విరగదంతాను'' (పఠాభి)

ఇట్లా అందరూ ఆనాడు తమ విశిష్టమార్గ స్పృహను ఆత్మాశ్రయ రీతిలోనే బలంగా చెప్పారు. ఆ స్పృహ అంత తీవ్రంగా ఉండడం, కాల్పనికయుగ అవశేషాల్నీ చెప్తుంది; తమ మార్గంమీద అంతటి తీవ్ర విశ్వాసం లేకపోతే ఆ కవులు వినూతన కవితా విప్లవాన్ని విజృంభింపజెయ్యలేకపోదురేమో అన్న ఊహనూ కల్గిస్తుంది. ఐతే రానురాను, అభ్యుదయ కవిత్వంలో ఈ "నేను''కి సంబంధించిన సామగ్రి తగ్గిపోయి వస్త్వాశ్రయరీతి బాగా పెంపొందింది. ఈనాడు కవి ''నేను విప్లవాన్ని తెస్తాను'' అంటే అది ఆ కవి ఇమేజి విలువలోనే పర్యవసిస్తోంది గాని, అభ్యుదయ ధోరణికి కొంత దూరంగానే కనిపిస్తోంది.

ఐతే, కుందుర్తిలో, చాలా అధికంగా బహుశః, అందరు అభ్యుదయ కవులకంటె ఎక్కువగా కావచ్చు, ఈ ''నేను'' వినియోగం కనిపిస్తుంది. ఈ 'నేను'కి కుందుర్తి కవితలో ఒక విశిష్టత ఉంది. మామూలుగా తాను, సామాన్యుణ్ణి నాయకుడుగా స్వీకరించి, సామాజిక చైతన్యం కోసం భాషా భావనారీతుల్లో ఒక ఉద్యమకారుడైన స్పృహ కుందుర్తిలో సర్వవ్యాప్తంగా ఉంటుంది. వస్త్వాశ్రితమైన వర్ణనల మధ్యనూ, అలవోకగా చేసిన ఉపమానాలలోనూ కూడా ఈ స్పృహ చాలా అధికంగానే కుందుర్తిలో కనిపిస్తుంది. అంతేగాక అహంకారస్ఫూర్తి గూడా అధికంగానే గోచరిస్తుంది. ఉదాహరణకి 'దండియాత్ర' కావ్యానికి ముందు

మాటలో కవి ప్రశంస చేస్తూ నన్నయనుండి, శ్రీశ్రీ దాకా ఆరుగుర్ని ఋషులుగా అభివర్ణించి, చివరకిట్లా అంటారు :

"ఆరుగురి పేర్లే చెప్పాను
అరే! మరిచాను సప్తమర్షి లేడా ?
ఏదో పేరు బయటపెడితే ఏడిచ్చస్తారు కొందరు
ఊహించడం సులువే; పైగా అహంకారం అంటారు గూడా"

ఇటువంటి స్పృహాధిక్యాన్ని, సాంప్రదాయిక కవులనుండి సంక్రమించిన ఆత్మ విశ్వాసంగానో, తాను గురువుగా పూజించే విశ్వనాథ నుండి సమార్జించిన లక్షణం గానో చెప్పుకోవచ్చు.

ఐతే, ఈయనలో అడుగడుగునా స్ఫురించే "నేను" కవితా శిల్పంలో అంగంగా మారడంలో ఈయన స్వీయముద్ర ఉంది. తన బాధల్ని వర్ణిస్తున్న ధోరణిలో, దేశంలోని సామాన్యుడి బాధల్ని స్ఫురింపజెయ్యడంలో కుందుర్తి సిద్ధహస్తుడు. ఈ రీతికి ఉన్న ప్రత్యేకత ఏమిటంటే, కవి సూటిగా పాఠకుడి హృదయంలోకి ప్రవహిస్తాడు. "అభియోగం" అనే కవితలో చూడండి :

"చరిత్ర పిలిచింది; చెల్లీ వెళ్ళొస్తాను
పెద్ద మనుషులు నలుగురి ముందుకు పిలిపించింది నన్ను
(చిన్నమ్మాయి జాగ్రత! గోడమీంచి పడేను
పెద్దవాణ్ణి బడికి పంపు వేళకింత పడేసి
అసలే వాడు పోకిరి, నా చారే వచ్చిందేమో !)"

ఇట్లా తానుగా చెప్తున్నట్లు, పాఠకుణ్ణి సూటిగా పలకరించి మాట్లాడుతున్నట్లు, మరొకరికి ఉత్తరం రాస్తున్నట్లు, ఇట్లా అనేక విధాల ఆత్మాశ్రయత్వాన్ని ప్రదర్శించి కుందుర్తి, పాఠకుడికి చాలా దగ్గరగా వచ్చే ఒక శిల్పాన్ని దాదాపు ప్రతి కవితలోనూ అనుసరిస్తాడు.

చివరికి, తాను చెప్తున్న కథాకావ్యం మధ్యలో గూడా ఉన్నట్లుండి తాను ప్రవేశిస్తాడు. ఉదాహరణకి 'దండియాత్ర'లో, 'కానిస్టేబుల్ చంద్రయ్య' కథ చెప్తూ, మధ్యలో ఒకచోట అతని కథ ఆపేసి, వెంటనే పాఠకుడు తనని అడుగుతున్నట్లు, తాను సమాధానం చెప్తున్నట్లూ కథని పొడిగిస్తాడు. చూడండి :

"ఒక ఉద్రేకపు ఉడుకు పిండాన్ని సృష్టించావు

ఆ తరువాత చంద్రయ్య ఏమైనాడో తెలేదంటావ్ ?
ప్రవేశపెట్టిన పాత్ర నిష్క్రమించేదాకా
ఏం జరిగిందో నీకు తెలేవద్దా ? ... ...
కావాలని కొన్ని ఘటనలు చెప్పకుండా దాచెయ్యడం
ఏమిటి స్వామీ యిదంతా ?
అదంతా సరేగాని అక్కడ పెరుమాళ్ళ సంగతి చెప్పండి
—తప్పుతుందా చెప్పకుండా? మీకేం పాఠక మహారాజులు
జనమేజయ మహారాజుల్లా చెప్పుచెప్పని పీడిస్తారు
అడిగేవాడికి చెప్పేవాడు లోకువ, తప్పుతుందా చెప్పకుండా"

కథలో ఉన్న ఉత్కంఠని ఒక మలుపు తిప్పడానికి ఈ శిల్పాన్ని తన కథా కావ్యాల్లో, కవితా నాటకాల్లో గూడా ఉపయోగిస్తాడు కుందుర్తి. అంతేగాక, తాను చెప్తున్న కథలన్నీ సమకాలిక సామాజిక జీవిత స్ఫురణతో నిండినవి కాబట్టి, పాఠకుణ్ణి తనలోనికి తీసుకోడానికి ఈ రీతి బాగా ఉపకరిస్తుంది, అదే ఒక ప్రాచీన కథ తీసుకుని తానుగా ప్రవేశిస్తే, అక్కడ రసభంగం కావచ్చు. కాని, కుందుర్తి రాసే సామాజిక కవితలో ఈ ఆత్మాశ్రయత్వం ఒక శిల్పంగా మారుతోంది.

ఇట్లా కుందుర్తి కవితలో కనిపించే "నేను" సామాన్యుడికి సంకేతమే. Waltt whitman అనే అమెరికన్ కవిలో కూడా ఈ రీతి బాగా ఉంది.

"I celebrate myself and sing myself
And what I assume you shall assume;
For every atom belonging to me as good
Belongs to you"

ఈ రీతిగా కుందుర్తి-నేను-"సామాజిక నేను". ఆత్మాశ్రయత్వాన్ని శిల్పంగా మార్చిన "నేను".

**కుందుర్తి-దేశీయత :**

"మళ్ళీ నరజన్మ ఎందుకంటే
మనుషులంటే యిష్టం నాకు

దేవుడికంటే మనిషి యిష్టం
దేశం యిష్టం-తెలుగు యిష్టం"

కుందుర్తికి సామాన్యుడియొక్క, ఈ దేశంలో సామాన్యుడియొక్క జీవిత సమస్యా వర్ణన ద్వారా, సామాజిక చైతన్యాన్ని సాధించడం పరమ లక్ష్యం కాబట్టి దానికి తగ్గ వాహికనిగూడా సంపూర్ణంగా దేశీయ ధోరణిలో భావించడం ఆయన ప్రత్యేకత. బహుశః వచన గేయాన్ని దేశీయసామగ్రి ద్వారా, తన దేశీయుల్లో చైతన్య పురోగమనానికి ఉపయోగించిన వారిలో కుందుర్తియే పూర్తి విజయం సాధించాడని నా నమ్మకం.

కుందుర్తి, తనకున్న ప్రాచీన సాహితీభాషాశిల్పపరిజ్ఞాన మంతటినీ, దేశీయతా ముద్రనంతటినీ, ప్రజాపరంగా మలుచుకున్న అచ్చమైన ప్రజాకవి. ఒకవిధంగా శ్రీ శ్రీ, తిలక్ మొదలైనవారు, అభ్యుదయ ప్రజాకవిత్వానికి ఎక్కువగా మార్గరీతి నాశ్రయిస్తే, కుందుర్తి అచ్చమైన దేశిరీతి నవలంబించిన వాడు. ఈ విషయంలో కుందుర్తి, వచనగేయ కవిత్వపు తిక్కన అనడానికి ఏమీ సందేహం లేదు.

వచన గేయంలో కుందుర్తికి కావలసిన మొదటి క్షణం అది సంపూర్ణ సమకాలిక వ్యావహారిక భాషలో ఉండాలి. దీన్ని గురించే చెప్తూ, "కుందుర్తి కృతులు" పీఠికలో ఆయనే యిట్లా అంటారు: "వరంగల్లులో ఏర్పాటు చేసిన 'మిత్రమండలి' సమావేశానికి అధ్యక్షత వహిస్తూ, ఆధునిక కవిత్వపు శైలి సామాన్య ప్రజల సంభాషణ స్థాయికి రావాలని నేను మొదటిసారిగా ప్రతిపాదించాను.'' సామాన్యుని సాంఘిక పురోగతినే లక్ష్యంగా తీసుకున్న కవికి ఈ సిద్ధాంతమే సంపూర్ణ న్యాయం చేకూరుస్తుంది. తర్వాత తర్వాత తెలుగు భాష లోని, ఆధునిక, అభ్యుదయ, ప్రయోగవాది వచనగేయాలన్నీ దాదాపు ఈ సిద్ధాంతానికి ఉదాహరణప్రాయంగా అభివృద్ధి చెందుతూ వచ్చినై. భాషకి సంబంధించిన వరకు ఈ పరిణామాన్ని ముందుగా, సమగ్రరూపంలో ఊహించింది కుందుర్తియే కావాలని నా అంచనా.

విదేశాల్లో కూడా 'సామాన్యుణ్ణి' కవితాకేంద్రంగా చేసుకున్న కవుల్లో గూడా, యిదే పరిణామం సహజంగా కనిస్తుంది. ఉదాహరణకి అమెరికా ప్రజాస్వామ్య వచనగేయ కవి ''వాల్ట్ విట్మన్'' కీ, కుందుర్తికీ చాలా అభిప్రాయాల్లో

దగ్గర పోలికలు కనిపిస్తై. Walt whitman కి కూడా ధ్యేయం "Common man." అతని కోసం వ్రాయబడే కవిత్వం ఎట్లా ఉండాలో ఆయన అభిప్రాయం చూడండి:

"The art of art, the glory of expression, and the sunshine of the light of letters is Simplicity. Nothing is better than simplicity... The greatest poet... is more the channel of thoughts and things without increase or diminution, and is the free channel of himself."

ఇట్లా చాలా అంశాలు Waltwhitman తో సమానమైనవి కుందుర్తిలో మనకి కనిపిస్తై. ప్రజాకవితా వికసనంలో, ఈ యిద్దరు వచనగేయ కవుల సామ్యాలు స్ఫుటంగా ఉంటై.

కవిత్వంలోని Symbols నీ, Images నీ, యితర రీతుల్నీ ప్రాచీన సంప్రదాయంలోనించీ, సాహిత్యరీతుల్లోనించీ కుందుర్తి పరిగ్రహించి, వాటినే ప్రజా పరంగా ఆధునికీకరించే విషయంగూర్చి ముందే ప్రస్తావించబడింది. అంటే ముల్లుని ముల్లుతో తీసేసే ప్రయత్నంలాంటిది ఈయన సాంప్రదాయికత. ఈ విధంగా కుందుర్తి సమకాలీన దేశీయ సమస్యావర్ణన ప్రధానమైన తన కవిత్వంలో భాషాభావనా విధానాల్లో దేశీయతని ప్రతిబింబింపజేస్తూ 'ప్రజాకవి"కి కావలసిన సమగ్ర సామగ్రిని కలిగి ఉన్నాడు.

కుందుర్తి తానై చెప్పుకున్న ఈ మాటలు చూడండి:

"ఈ నాడు మన కవిత్వం
వర్తమాన చరిత్రలోని ప్రజోద్యమచైతన్యానికి
పేరు మోసిన ప్రతినిధి
వ్యవహారిక భాషాప్రయోగ ఫలితాలనిధి
ప్రజలకోసమే రాసేది: వారే కృతిభర్తలు
ప్రజలగురించే రాసేది: వారే భవిష్యత్ నిర్మాణకర్తలు"

## కుందుర్తి - వచనగేయ శిల్పం :

కవిత్వంలో "ఏం చెప్పాలి? ఎట్లా చెప్పాలి?" అనే రెండు విషయాల్లో మొదటి విషయాన్ని గూర్చి సర్దిష్టమైన సామాజిక వస్తు దృక్పథంగల కుందుర్తికి,

చాలామంది ఆధునికులవలె కాకుండా. రెండో విషయాన్ని గూర్చి గూడా విస్పష్టమైన నిర్మాణాత్మక ఆలోచనలున్నై. కొంతమంది అతివాదులు, కేవలం వస్తుసిద్ధాంతాలమీద దృష్టిని కేంద్రీకరించి. శిల్పాన్ని పూర్తిగా విస్మరించడం జరిగింది. ఆ కోవకి చెందిన విమర్శకులుకూడా ఒక కవితలోని వస్తువుని, తమ సిద్ధాంత దృష్టితో విశ్లేషిస్తే, అదే సరైన విమర్శ అనే ఒక దృక్పధాన్ని వ్యాపింపజేశారు. కాని, "ఎట్లా చెప్పాలి?" అనే విషయానికున్న ప్రాధాన్యాన్ని నేడు ప్రపంచమంతా గ్రహిస్తోంది. ఎందుకంటే- ఒక కవి తాను చెప్పదలచిన వస్తువునే, తాను కోరిన ప్రయోజనం కోసమే, సాధ్యమైనంత బలంగా చెప్పా లంటే, ఆ కవికి శిల్పాన్ని గూర్చిన స్పృహ ఉండిరాలి. శిల్పం అంటే, చెప్పేరీతిని యింకా క్లిష్టం చేసే ఒక అపమార్గమనీ, శిల్పంకోసం చేసే ప్రయత్నం వస్తువుని మింగేస్తుందనీ జరిగే ప్రచారాలు. ప్రచారాలు మాత్రమే. నువ్వు కోరిన వస్తువునే నీకంటే యింకొకడు బాగాచెప్పి ప్రజల హృదయాల్లోకి వెళ్తున్నా డంటే, అతని దగ్గరఉన్న ఆ అదనపుశక్తిని అంచనా వెయ్యడం అత్యవసరం. ఆ అదనపుశక్తిని గూర్చిన విచారణ సాహిత్య విమర్శలో లోపించడమే అవసర మని/చేసే ప్రచారాలు, అప్పుడప్పుడే కవిత్వంలో అడుగుపెడుతున్న యువకుల హృదయాల్లో ఆవేశాన్నిమాత్రమే రెచ్చగొట్టి, నినాదప్రాయమైన రచనల్ని మాత్రమే చేయిస్తున్నై. శిల్పం, వస్తువుని మింగేసేటంతగా విస్తరించడం, ఏనాడూ అంగీకరించదగింది కాదు. కాని వస్తువుని సాధ్యమైనంత ప్రయోజ నాత్మకంగా చెప్పడానికి అవసరమైన శిల్పపరిజ్ఞానమూ, ఆలోచనా, కవికి చాలా అవసరం. దీన్ని బాగా గుర్తించిన అభ్యుదయ ప్రజాకవి కుందుర్తి. అయన అభిప్రాయం చూడండి.

"వచన కవిత్వపు వైఖరిలో, భావనలో, శైలిలో, భిన్న భిన్న మార్గాలు ఏర్పడినవన్నమాట. వీటిని సూక్ష్మంగా పరిశీలించి, వాటి విస్తృతికి దోహదం చెయ్యడం, ఆ కృషిలో తమ క్రొత్త ప్రత్యేకతలని నిర్మించుకోవడం యువతరం కవులు చేయవలసిన పని. వచన గేయంలో యిప్పుడిప్పుడే ఏర్పడుతున్న పంక్తి నిర్మాణ శిల్పరహస్యాల్ని వారు గమనించాలి ...... ఈ విధంగా రచనా శిల్పాన్ని గూర్చి ఆలోచనాత్మకమైన విమర్శ చేసుకోవడం అవసరం. ఈ విధమైన పరిశీలన లేనివారికి ప్రత్యేకమైన శైలి ఏర్పడడం కష్టం..."

ఈ విధంగా శిల్పంమీద ప్రత్యేకమైన దృష్టికలిగి, తనదీ అని చెప్పుకో దగిన ఒక ముద్రను సాధించిన కుందుర్తి వచనగేయాన్ని, విశ్లేషణాత్మంగా పరిశీలించడం చాలా అవసరం. వచనగేయపు పోకడల్లో కుందుర్తిలో ప్రధానంగా కనబడే మొదటి అంశం "భావలయ".

ఈ కాలపు వచనగేయం, అన్ని నియమాల నుండీ పూర్తి స్వాతంత్ర్యాన్ని సాధించింది. భావగతమైన లయలతోగాని, అనుప్రాస, అంత్యప్రాస మొదలైన వాటితోగాని ఈనాటి వచన గేయానికి అవసరంలేదు. Symbolism, Imagism, Metaphor, లేక ఒక అనుభూతిసాంద్రత- యిట్లాంటి అనేక కవితాలక్షణాలు మాత్రమే పాదాల వేర్పాటుకి కారణాలై, ఏ లయతో నిమిత్తంలేని ఒక కవితా సంపూర్ణత మాత్రమే పాదాల్ని విరుస్తోంది. దీనికి కారణం వచనగేయంనిండా "Thick Poetry" బాగా వ్యాపించింది. ఏ మాత్రం సంబంధమైన సాంద్రత లేకపోయినా, అది వట్టి వచనంగా తేలిపోతోంది. అంటే బహిర్గతమైన లయలను అన్నింటినీ ఈనాటి వచనగేయం దాదాపు వదిలివేసినట్లే. ఎక్కడైనా భావానికి తీవ్రతనో, విలక్షణత్వాన్నో తీసుకురావడానికి మధ్యలో అటువంటి లయల్ని ఉపయోగించుకోవచ్చు. కాని, దాని ప్రాధాన్యం మాత్రం పూర్తిగా విసర్జించబడింది.

కాని, వచన గేయాన్ని, అప్పుడప్పుడే ప్రచారానికి తెచ్చి, దాని కొక విశిష్టశైలి నేర్పరచే సమయంలో, ఆ కవులకి ఎదురైన సమస్యలు వేరు. వాళ్ళు అప్పుడప్పుడే, ఛందోబద్ధమైన లయని వదిలేసి, నూతనమైన ఛందస్సుని ప్రచారంలోకి తేవడానికి పూనుకొన్న వాళ్ళు. ప్రజల మనస్సులో ఛందోబద్ధమైన లయకి ప్రముఖస్థానమున్నది. దాన్ని తొలగించి ఒక నూతనత్వాన్ని ఈ కవులు ప్రవేశ పెట్టాలి. అందువల్ల కేవలం భావప్రధానమైన మరొక విధమైన లయని తీసుకురావడం వాళ్ళకి తప్పనిసరియైంది. ఆనాటి పద్యం, ఈనాటి సంపూర్ణముక్తచ్ఛంద కవితగా పరిణమించడంలో, ఒక మధ్యేమార్గం ఆనాటి వచన కవితలోని భావలయ. భావానికి అనుగుణంగా గళాల్ని ఏర్పరచుకొని, వాటిలో ఒక లయని పాటించడం, ఒక భావాన్ని రెండు, మూడు, లేక నాలుగు, అట్లా ఎన్ని పాదాలుగానైనా విరవడానికి అటువంటి లయని అవలంబించడం, అంత్య ప్రాసల్ని

పాటించడం, పాదాల మధ్యలో యతిమైత్రి స్పష్టమైన అక్షర సామ్యంతో ఉప యోగించడం, అక్షరగతంగానో, పదగతంగానో ఒక సామ్యాన్ని పాదాంతాల్లో వినియోగించి, ఒక లయని తేవడం-యిట్లాంటి అనేక నియమాల్ని అనుసరించారు ఆ మొదటి వరుసలోని వచనగేయ కవులు. పద్యంలోని కృత్రిమమైన పాద విభజననీ, గణాల్నీ, యతుల్నీ, ప్రాసల్నీ వ్యతిరేకించి, భావానుగుణంగా వాటి నన్నింటినీ నిర్మించడంలో అనేక మంది వచనగేయ కవులు అనేక మార్గాల్ని నిర్మించుకున్నారు. ఈ భావలయ, భావగణాలు మొదలైన వాటిని గూర్చి శ్రీ అరిపిరాల విశ్వం, శ్రీ కోవెల సంపత్కుమారాచార్యులు మొదలైన ప్రముఖులు కొన్ని స్పష్టమైన సిద్ధాంతాల్ని నిర్దేశిస్తూ ప్రత్యేక వ్యాసాలుగూడా వ్రాశారు. ఇట్లా భావలయని సాధించడంలో కుందుర్తికి తనదైన ఒక ప్రత్యేక ముద్ర ఉంది.

కుందుర్తి ప్రతి గేయంలోనూ, పాదాలు కొన్ని కొన్ని పంక్తులుగా, భావసంపూర్ణతని బట్టీ, లయని బట్టీ, ప్రత్యేక భాగాలుగా విరిగిపోతై. ఉదాహ రణకి- 'పసికూన పుట్టుక'లో-

"హేతువును శపిస్తారనీ
నిజం గొంతు నులుముతారనీ
ఎవరో వెలుగును ఉరితీస్తారనీ
అనుమానం పసికూనకు—
ఆ సాయంత్రం చీకటి పిలుపులో
తొలిసారిగా గాలి పిలుపులో
ఊహ తెలిసింది కొంచెం పసికూనకు—
కానలో కాసిన కాయలూ, పండ్లూ
మానవులకు హక్కులేదట
పులులూ, పులుగులూ తమ సొత్తులుగా
దానవులు దాచేశారని సొంత సొత్తుగా"—

మొదటి ఖండం నాలుగు పంక్తులుగా ఏర్పడింది. పై మూడు పాదాల్లో ఒకే రక మైన క్రియాంత పదాలు ఒక లయని ఏర్పరుస్తున్నై. నాలుగో పాదం వేరుగా ఉండడం అక్కడి లయకు దోహదంచేస్తూ, మూడుగా విరిగిన రెండోఖండం చివరి పాదంతోని సామ్యంతో లయకి చేతులు జాస్తోంది. మూడో ఖండం మళ్ళీ

మరో విధమైన లయతో నాలుగు పాదాలైంది. ఇట్లా ఒక్కొక్కచోట 7,8,9,10 పాదాలుగా, భావాన్ని బట్టీ, అక్కడి పదాల, అక్షరాల సామ్యాన్ని బట్టీ ప్రత్యేక ఖండికలు కావడంలో కుందుర్తి మార్గం ఉంది. రహస్యం ఏమిటంటే, ఎన్నోకొన్ని పంక్తుల సమాహారంతో ఐన ప్రత్యేక ఖండికలలో,ఒక భావం సంపూర్ణం కావడం, ఏదో ఒక లయ ఆయా ఖండికల్లో ప్రత్యేకం పాటింపబడటం. ఇంకోరకమైన లయశిల్పం చూడండి: "చోట్లేదు" అనే ఖండికలో 6 ఖండికలుగా గేయం విభజింపబడింది. నాలుగు ఖండికలు నాలుగేసి పాదాలుగా కూర్చబడినై. "రా తమ్ముడూ పోదాం'' అని ప్రతి ఖండికా మొదలౌతుంది, 5 ఖండికలదాకా. 5 ఖండికల మొదటి పాదాల్లో, 'రా తమ్ముడూ పోదాం' అన్న తర్వాత భావాని కనుగుణమైన లయతో, 5 ఖండికలూ రాయబడినై. ఉదాహరణకి-

"రా తమ్ముడూ పోదాం, మనకు చోటు లేదిక్కడ"
''రా తమ్ముడూ పోదాం, ప్రమాదాల పల్లకీ మీదెక్కి"
"రా తమ్ముడూ పోదాం, పడవ బయలుదేరబోతుంది"
''రా తమ్ముడూ పోదాం, ఆకాశపు అంచుల్లోకి''
''రా తమ్ముడూ పోదాం, అనంత సౌందర్యంలోకి''

మొదటి నాలుగు ఖండికల్లోనూ, మొత్తం అన్ని పాదాల్లో ఒక్కొక్కటీ భావ లయతో (పద్యంలో యతి దగ్గర మాదిరి) రెండు సగాలుగా విరిచెయ్యవచ్చు. మళ్ళీ మొదటి నాలుగు ఖండికల రెండోపాదాల చివరల్లో ఒక సామ్యం ఉంది. ''హాయిగా కాలం గడుపుదాం'', ''ఏరుదాటి వెళ్ళిపోదాం'', ''ఎవర్నీ ఏమనొద్దు మనం'', "వెనుదిరిగి చూడొద్దు మనం"- యిట్లా ''మనం ఈ పని చేద్దాం'' అనే అర్థంగల భావలయ పాటింపబడింది. మొదటి నాలుగు ఖండికల చివరి పాదాల్లో మకుటంలాగా, భావతీవ్రత కోసం ఒకే పంక్తి రాయబడింది.

"మనిషికంటే నయంకదూ! అమ్మో భయమేస్తుందిక్కడ"

మొదటి నాలుగు ఖండాల్లో, ఇట్లా, ఈ నరుల్లోంచి వెళ్ళిపోదామన్న భావానికి సమగ్రతనిచ్చే, ఐదో ఖండికలో ఎక్కడికి వెళ్ళాలన్నదాన్ని ఒక లయతో చెప్పాడు.

"పచ్చనిగడ్డి మైదానాలమీద ప్రభాతం మెరుస్తున్న చోటికి
ఎదలో కరుణ జడివానలా కురుస్తున్న చోటికి"

ఇట్లాగే యింకో రెండు పాదాలు, ''వీస్తున్న చోటికి'', ''కాస్తున్న చోటికి'', ''తెరుచుకునే చోటికి'' అని ఒకే విధమైన క్రియా పదాల సంఘటన లయతో అంతమౌతై. యిట్లా ఐదో ఖండిక 6 పాదాలైంది. చివ్వరి ఖండిక మూడు పాదాలే ఐ, గేయానికి మణికిరీటంలా, ఎట్లాంటి లయతో ముగుస్తుందో చూడండి:

''ఆకాశం హరివిల్లువేసి వయ్యారంగా
ఒళ్ళు విరుచుకునే చోటికి
రా తమ్ముడూ, పోదాం, మనకు చోటు లేదిక్కడ''

అని మూడు పాదాలతో ఒక కలికితురాయిని గేయానికి తొడిగి, మొదటి పాదంలో ప్రారంభించిన పాదంతోనే ముగిస్తాడు. దాంతో గేయంలోని భావానికి చెప్పలేనంత సమగ్రత, తీవ్రత ఏర్పడినై. ఇట్లా వచనగేయాల్ని కొన్ని కొన్ని పాదాల ఖండికలుగా విరవడం, వాటిల్లో భావానుగుణంగాను శబ్దాశ్రితంగాను లయని పాటించడం, కుందుర్తి గేయాల్లో కొన్ని వందల విధాలుగా ఉంటుంది. ఇదే ముఖ్యంగా ఆయన వచన గేయాలకి భావానుగుణమైన శిల్పరీతినీ, ఒక ప్రత్యేక ముద్రనీ సంతరించింది.

వచన గేయంలోని శైలిలో ''విసురు'' అనేది ఒక ముఖ్యమైన అంశంగా కుందుర్తి చాలాచోట్ల చెప్తూ ఉంటారు; శ్రీ గోపాల చక్రవర్తిగారి 'కలంకలలు'కు ముందుమాట రాస్తూ ఒకచోట కుందుర్తి అన్నమాటలు ఈ 'విసురు'ని ఆయన ప్రధానాంశంగా స్వీకరించారనే అంశాన్ని వెల్లడి చేస్తుంది:

''...ఇటువంటి విసుర్లు పద్యాల్లో కూడా ఉంటై. అక్కడి కంటే, యిక్కడ (వచన గేయాల్లో) వీటి ఆవశ్యకత మెండు. వచన గేయంలో 'విసురు' ఒకముఖ్య లక్షణంగా నేను ప్రతిపాదిస్తున్నాను. ''ఈ విసురు, దానంతటదే చాలా గొప్ప విషయమని కాదు. భావానికి ఉద్దీప్తి కలిగించ వలసిన ప్రదేశాల్లో, పద్యాల్లో వదిలి పెట్టేసిన ఛందోగత తీవ్రతకి ప్రత్యామ్నాయంగా, వచన గేయంలో ఈ విసురు తేవాలని కుందుర్తి అభిప్రాయం. ''నాలోని నాదాలు''లో కూడా ఒకచోట యీ విషయాన్ని రమ్యంగా వ్యక్తీకరించారు:

''ఒక్కొక్క కిరణంవచ్చి చీకటి గుండెల్లో గుచ్చుకుంటున్నట్లు
ఒక్కొక్క చరణంలోని 'విసురు' వందచోట్ల తగిలేటట్లు

వచనగేయం రాస్తుంటే నేను...
గణాలు లేనివి గుణాలు కాదని గర్జిస్తారు మీరు!''

ఈ విసురుని, తీవ్రభావం వచ్చిన చోట్ల లేదా, ఒక సౌందర్య అధిక్యాన్నో మరి-దేని ఉదాత్తతనో ఊపుతో చెప్పవలసిన చోట్ల యిట్లా సముచితమైన చాలా ప్రదేశాల్లో, కుందుర్తి బాగా వినియోగించుకుంటాడు. ఆ విసురుని కూడా, ప్రతి పాదంలో ఒక భావాన్ని తీవ్రంగా నడిపించి అట్లా కొన్ని పాదాల్ని వరుసగా చెప్పడమూ, ఒకే ఒక సుదీర్ఘవాక్యం ఊపిరి నిలబెట్టి సాగిపోవడం-మొదలైన అనేక విధాలుగా కుందుర్తి సాధిస్తారు.

సామాజిక జీవితాన్ని చెప్పి, ప్రజల హృదయాల్ని కదిలించడంలో, అభ్యుదయ కవితకి స్థూలంగా రెండు ధోరణులు ముఖ్యంగా కనిపిస్తై. ఒక ధోరణి, తనకు నచ్చని సాంఘిక రాజకీయ సమస్యల్ని తీవ్రంగా నిందించి, ప్రజల బాధల్ని హృదయం కరిగిపోయేట్లు వర్ణించేది. ఈ భావాలు ప్రధానమైన కవుల్లో కవిత్వం ''కసి'' త్వపుమేరకు చేతులుజాస్తూ ఉంటుంది. ఆవేశ ప్రధానులైన కవులకి ఇది ఊపిరి. కాని, సంయమనం ముఖ్యంగా గల కుందుర్తి ప్రజా సమస్యల్ని అభివ్యక్తీకరించడంలో మరో ధోరణిని ప్రధానంగా అవలంబిస్తాడు అది ''వ్యంగ్యం'' లేదా వక్రోక్తిచమత్కారం. ఇప్పుడు చెప్పిన రెండు మార్గాల్లో ఏది మిన్న అనే ప్రశ్నలేదు గాని, కుందుర్తిలాంటి కవులు వ్యాప్తి చేసింది రెండో మార్గాన్ని. అందులోను, కుందుర్తి కవిత్వానికి యిదే జీవనాడిగా కనిపిస్తుంది. ఈ విషయానికి ఆయన ప్రతి కవితలోనూ దాదాపు ఉదాహరణలు కనిపిస్తై. కాని ఆ మార్గదీపికలుగా ఒకటి రెంటిని పేర్కొంటాను.

''ఆస్తికులు చేదస్తానబడి అసలు సంగతి వదిలేశారు
నాస్తికులు కొద్దికొద్దిగా 'ఆస్తులు' సంపాదించుకున్నారు
గణపతి నవరాత్రులు ముగిసిన మర్నాడు
వేల సంఖ్యలో కొబ్బరిచిప్పలు వేలం వేశారు!''
(భగవంతునికి బహిరంగలేఖ).

''సైకిలుకు కట్టిన బిందెలమీద
గుడ్డమూత పూర్తిగా తీసేసి

వణుక్కుంటూ పాలవాడు
వరండాలో నుంచున్నాడు''      (నగరంలో వాన)

ఈ సునిశితమైన వ్యంగ్యశక్తి 'అవహేళన'లో పర్యవసించి, ప్రజా భావాల వ్యాప్తిలో చాలా ప్రముఖస్థానం వహిస్తుంది. ఈ వ్యంగ్యం, అవహేళన శక్తి ఆయన ''తెలంగాణా'' కావ్యంలో పతాకాష్టనందుకున్నదనిపిస్తుంది. ''సంఘం'' చైతన్యాన్ని వర్ణిస్తూ అంటారు-

"చెట్ల కొట్ల దగ్గర చిలకషావుకార్లు
పండిన పండ్లు చవుక ధరల కమ్ముతారు-
కాపలాదార్ల కండ్ల బస్తాల మూతులను
దబ్బనాలతో కుట్టి
ధాన్యం అడివికి పోతుంది''

రాజరికపు దుర్మార్గాన్ని వర్ణించే మరోచోట ఆయన వ్యంగ్యం చూడండి:

''ఒక కూలి పొలంపోయి యిల్లుచేరుకునేసరికి
ఏలిన దొరవారి 'ఘనమైన' సేవకులు వచ్చి
పెళ్ళాన్ని 'జప్తు' చేశారు''

ప్రతి పదంలో, అవహేళనకీ, వ్యంగ్యానికీ, వక్రోక్తికీ విశ్వరూపం పొందిన కావ్యం "తెలంగాణా.'' సునిశితమైన, సూక్ష్మమైన, బహు ప్రయోజనాల్ని నెరవేర్చే యీ వ్యంగ్యశక్తి, కుందుర్తి, సంప్రదాయాన్ని ప్రజాపరం చెయ్యడంలోని ఒక ప్రధానాంశంగా చెప్పాలి. బహుశః ఈ స్పృహతోనే 'నాలోనినాదాలు' లో ఇట్లా అన్నారు:

''వాచ్యార్థం వంటి భూతకాలం వెనకాల
దాక్కున్న 'ధ్వని' వంటి వర్తమాన వాహనంమీద
పర నిర్వృతి, ప్రాయమైన
భవిష్యత్తుకు నా పయనం''

ఒక్కొక్కచోట ఈ ధ్వనిశక్తి, అమితశక్తిని చేకూర్చుకొని, అల్పాక్షరాల్లో అనల్పార్థ రచన స్థాయికి చేరుకుంటుంది: "ఇప్పుడే వచ్చిన వార్త'' అనే గేయంలో భారతీయ సైనికులు శత్రువులతో యుద్ధంచేసే సందర్భంలో-

"హత సైనికులను సంజీవించే
బ్రతికించడానికి కాబోలు
తన 'గుండె' మనియార్డరు చేశాడు.
కేరళలో పల్లెకారి"

దేశం నాలు మూలల్లో వ్యాపించిన దేశభక్తిని. ప్రజలు విరాళం సంపదాన్ని మిళితంచేసి "గుండె మనియార్డరు" చెయ్యడంలో చాలా ధ్వని సాధించాడు కుందుర్తి. అట్లాగే నెహ్రూమీది ఎలిజీలో ఒకచోట-

"టెలిఫోన్ తీగలద్వారా లోకంలో శోకం ప్రవహించింది" అంటాడు. ఇట్లా సులభమైన మాటలకి, బరువైన ధ్వనిని కల్పించడంలో కుందుర్తి ప్రతిభ ఉన్నత దశల్లో గోచరిస్తుంది. వచన గేయానికి వస్తువుతోపాటు ఒక నిర్దిష్ట శిల్పాన్ని నిర్ణీతం చేసుకోడంలో కుందుర్తి ధోరణులు కొన్ని విశదీకరించడం జరిగింది. ఇంకా విశ్లేషిస్తే, ఎన్నో శిల్పరీతుల్ని విమర్శకులు సంగ్రహించగలరు. అతి భారమైన సాంప్రదాయిక ఆలంకారిక శోభల్ని, ప్రజాపరం చెయ్యడంలో, ప్రయోజన స్థాయిలో వినియోగించుకోడంలో. నిశిత మార్గంగల వారికి కుందుర్తి ఎన్నదగినవారు. "భగవంతునికి బహిరంగ లేఖ"లో అంటారు-

"సర్వ భారతీయ పురాసాహిత్య సంప్రదాయాలచేత
ప్రభావితమైన నా గుండెలో
పలికే 'నవ్య' కవితావిపంచీ!
అనంతమైన మహార్థాలు ఆవిష్కరించే మాటల సంచీ!"

## కుందుర్తి-కథాకావ్యం :

వచన కవిత్వాన్ని, సామాన్యుల జీవన వర్ణనకి అనుకూలమైన రూపంగా భావించిన కుందుర్తి, దానిని ఒక మహోద్యమంగా పరిణమింపజేసి, దాని విశ్వ రూపాన్ని వ్యాప్తిచేసే సంకల్పాన్ని ప్రచారంచేసినవాడు. వచన కవిత్వాన్ని అన్ని భావాలకీ, అన్ని రసాలకీ ఒదిగే రూపంగా ఆయన భావించారు. అందుకే కేవలం ఖండికలుగా ప్రచారం పొందుతున్న వచనకవిత్వంలో కథాకావ్య కల్పన చాలా అవసరమని గుర్తించి, ఆ వాదాన్ని బాగా ప్రచారంలోకి తెచ్చారు. బాల గంగాధర తిలక్ మొదలైనవారు కుందుర్తి యీ వాదాన్ని ఖండించారు. వచన గేయం కేవలం అనుభూతుల ఆవిష్కరణకోసమే ఏర్పడిందనీ, దానిలో కథ

కావ్యం రాయడం, మళ్ళీ పాతదోవలోకి ప్రయాణం చెయ్యడమేననీ వారు అభిప్రాయ పడ్డారు. కాని నిజాన్ని జాగ్రత్తగా గమనిస్తే. వచనగేయ పరిణామంలో కథా, నాటకరచన తప్పని సరియైన పరిణామంగా కనిపించక మానదు. విప్లవ రచనలు విపరీత ప్రచారంలోకి వచ్చినప్పుడు రాను రాను ఆ కవులు నినాద బాహుళ్యం మీదకంటె, కథలమీద ఎక్కువ యిష్టం కనబరచడం ప్రారంభించారు. చెల్లీ చంద్రమ్మా అనే పాటగాని, కొన్ని సంఘటనలు తీసుకుని వచనగేయాలుగా రాసిన రచనలుగాని, ప్రజల హృదయాలలో ఎక్కువ స్పందన కల్గించడం గుర్తించబడింది. సంఘటనలు గాకుండా, ప్రజా సంబంధమైన భావాల్ని చిన్న చిన్న ఖండికలుగా రాస్తే, నినాద ప్రధానాలుగా మారిపోయే అవకాశం ఎక్కువ. అదీగాక, వస్తువుని అనేక కోణాలలో చూపించే అవకాశం కథలో, నాటకంలో ఉంటుంది. అది కవితామూలమైనప్పుడు, వాటి స్పందన ఎక్కువ. ఈ విషయాన్నే విశదీకరిస్తూ కుందుర్తి శ్రీ శీలా వీర్రాజు రాసిన "కొడిగట్టినసూర్యుడు" అనే వచన గేయకథా సంపుటి పీఠికలో తన వాదాన్ని విశదీకరిస్తారు:

"కథలోని సన్నివేశాల్ని బట్టి కవి ఎంతో వైవిధ్యం ప్రదర్శించవచ్చు. కల్పనలో అనేకమైన సొగసులు చేసుకోవచ్చు. పాత్రల మనస్తత్వాలను పరిశీలించ వచ్చు. నాటకీయత సాధించవచ్చు. తన ప్రతిభలోని ప్రతి అంశాన్ని ప్రకటించుకోవచ్చు. ఈ నాటి ఖండికల రూపంలో యిదంతా సాధ్యంకాదు."

వచనగేయానికి యింత విస్తృతమైన రూపాన్ని సంకల్పించిన కుందుర్తి దానికి సంబంధించిన ప్రయోగాల్ని కూడా తానే ప్రారంభించాడు. వచన కవిత్వంలో మొదటి కావ్యంగా "తెలంగాణా" తానే రాసినట్లు, మొదటి నాటకమైన 'ఆశ' తానే రచించినట్లు ఆయన చెప్పుకొన్నారు. తర్వాత కథా ప్రధానమైన 'దండియాత్ర' అనే కావ్యాన్ని, 'ఆచార్లగారమ్మాయి,' 'శిక్ష ఏమిటి' అనే నాటకాల్ని గూడా తాను రచించారు. కుందుర్తి కథాకావ్యాల్లోనూ, నాటకాలలోనూ ప్రదర్శించిన రచనా శిల్పాన్ని సంపూర్ణంగా వివరించే పరిధి యీ వ్యాసానికి లేనందువల్ల, దిక్ప్రదర్శనంగా కొద్ది వివరాల్ని పరిశీలిస్తాను.

తెలంగాణాలో సుమారు 1946-48 ల మధ్య నైజాం ప్రభువుకీ, పేద రైతులకీ మధ్య జరిగిన భూపోరాటం, గెరిల్లా యుద్ధం, చారిత్రకంగా అత్యంత ప్రసిద్ధమై, ప్రజాశక్తిని ఋజువుచేసిన సంఘటన, దీన్ని గూర్చి సామాజికంగా

రాజకీయంగా చర్చించడానికి యిది సందర్భం కాదు. కాని తెలంగాణా పోరాటం మీద సమగ్రమైన వివరాలతో, సామాన్యుని హృదయాన్ని కదిలించే రచనా విధానంతో, ఆ నాడు రాయబడ్డ కావ్యం 'తెలంగాణా' ఒక్కటే. చాలామంది కవులు ఆనాడు తెలంగాణా పోరాటాన్ని వర్ణించినా, కొన్ని కవితలు ప్రయోగ వాదానికి బలియై పోవడము, కొన్ని విడి విడిగా నినాదాలుగా ఉండటమూ, కొన్ని ప్రత్యేక సంఘటనలను ఖండికలుగా రాయడమూ మాత్రమే జరిగింది. అందుకే తెలంగాణా పోరాటానికి అద్దం పట్టిన సమగ్ర రచనగా ఆధునిక కాలంలో కుందుర్తి 'తెలంగాణా' ప్రసిద్ధమైంది. అందులోను ఇది వచనగేయ ప్రస్థానంలో ఒక ముఖ్యమైన మలుపై, సంపూర్ణ కథాకావ్యాలకి మార్గదర్శకం కావడం విశేషం. దాన్ని దృష్టిలో పెట్టుకునే కుందుర్తి తనకు తానే యీ కావ్యంలో ఒకచోట–

"బహుశా యిదే మొదలనుకుంటాను
గేయాలు తెచ్చిన కొత్త తెలుగు
ఆధునిక యుగంలో ఒక పూర్ణ కావ్యంగా
బతుకును వర్ణించడం"

అంటారు. కుందుర్తికి తెలంగాణా పోరాటం వెనుకనున్న రాజకీయ సిద్ధాంతాలతో, వాటి మలుపులతో, వైరుధ్యాలతో నిమిత్తం లేదు. ఫ్యూడలిజమ్‌కి ప్రతిఘటించిన ప్రజాబలాన్ని వర్ణించడమే కుందుర్తి లక్ష్యం. 'తెలంగాణా' పీఠికలో తానే చెప్పు కుంటారు:

"తెలంగాణా ఉద్యమంతో నాకు ప్రత్యక్షంగా గాని, పరోక్షంగా గాని సంబంధం లేదు. ఈ కావ్యం కేవలం నేను భావించుకున్న ఊహలకు కవితా కల్పన; కావ్యరచనకు కథావస్తువు; కల్పనా ప్రతిభా రెండూ ముఖ్యమే. పనికి మాలినదని ఏనాడో ఋజువై, చారిత్రక పరిణామంలో పాతదై పోయిన ఫ్యూడల్ వ్యవస్థమీద ఒక పెద్ద తిరుగుబాటుగా తెలంగాణా ఉద్యమాన్ని నేను భావించాను" ఈ కావ్యంలో ఆయన సాధించిన ఘన విజయాన్ని ఆయన లక్ష్యంతో మాత్రమే విమర్శించడం న్యాయమనుకుంటాను. పోలీసు చర్యను ఈ కావ్యంలో కుందుర్తి సమర్థించడం, కమ్యూనిస్టు పార్టీ సిద్ధాంతాలకి కొన్ని చోట్ల విరుద్ధమైన అవగాహన కనిపించడం మొదలైనవి పట్టించుకోకపోవడమే

ఈ కావ్య విమర్శకి పరిధిగా పెట్టుకోవాలనుకుంటాను. ఫ్యూడలిజమ్‌కి ఎదురు తిరిగిన ప్రజా ప్రతిఘటనలోని శక్తినీ, చారిత్రక పరిణామ క్రమాన్నీ యీ కావ్యంలో కుందుర్తి ప్రధాన ధారగా నిరూపించారు.

ఈ కావ్యం ఫ్యూడల్ ప్రభువుల దౌర్జన్యానికి ఎదురు తిర్చిన ప్రతిఘటన లోని విజయాన్ని నిరూపించే కావ్యం. ఈ కావ్యపు ఆద్యంతాల్లో ఈ రహస్యం చక్కగా ధ్వనింపజెయ్యబడింది.

"తెలంగాణా'' కావ్యాన్ని బాగా పరిశీలిస్తే, యిది ధ్వని ప్రధానమైన వచనగేయ మహా కావ్యంగా చెప్పాలి. అది, లోతుగా ఆలోచిస్తేగాని స్ఫురించని ధ్వని కాదు. కావ్యం అంతా చదివిన తర్వాత, పాఠకుని గుండెని యింతగా కదిలించిన శక్తి యీ కావ్యంలో ఏది అని ఆలోచిస్తే, వెంటనే తెలుసుకోగల సమాధానం అదే: కుందుర్తికి ఈ కావ్యంలో వ్యక్తులు, వారి మధ్య నడచిన కథ, సంభాషణలు, సంఘటనల విశదీకరణ నాటకీయత- యివన్నీ ప్రధానం కాదు. ప్రజా ప్రతిఘటన శక్తిని, అగ్నిధారగా పోతపొయ్యడం ఈ కావ్యం లోని ప్రధాన వస్తువు. ఈ కావ్యంలో నాయకుడు అదే! దాన్నే ''సంఘ సూర్యుడు"గా వర్ణించడం, అది చీకటితో చేసిన పోరాటంగా సంకేతం తీసు కోడం ఈ సత్యాన్నే చెప్తుంది. సూర్యుడికీ, చీకటికీ జరిగిన పోరాటం మళ్ళీ మళ్ళీ కావ్యంనిండా పునరుక్తమౌతూ ఉంటుంది. యిది ప్రధాన చైతన్యాన్ని ధ్వని పూర్వకంగా చెప్పడం. నాయికానాయకులు, కథా సంఘటనలు ముఖ్యం కాదు కాబట్టే, ఈ కావ్యంలోని, అడుగడుగులోని ధ్వని శిల్పం సార్థక మౌతోంది: చరిత్ర, కాలం, పరిణామం, మార్పు, చైతన్యం మెదలైన ప్రధాన శక్తులు, కావ్యంనిండా మళ్ళీ మళ్ళీ రావడం, వాటిని చెప్పేటప్పుడు, చాలా తీవ్రంగా చెప్పడం, కుందుర్తి చారిత్రక పరిణామక్రమాన్ని ఈ కావ్యంలో ప్రధాన విషయంగా స్వీకరించాడనే సత్యాన్ని తెలుపుతుంది. ఉదాహరణకి-

''క్రమక్రమాగత చైతన్య
ధనుష్ప్రాణులు ప్రజలు నేడు
సమాజ సమిష్టి ప్రయోజన
నిశితబాణులు ప్రజలు నేడు''

ఈ పాదాలు కావ్యంలో చాలాసార్లు పునరుక్తమౌతై, ప్రధాన సంఘటనలలో. పైగా, పైన చెప్పిన ప్రధానాంశాల వర్ణనలో శైలికూడా గమనార్హంగా మార

పోతుంది. సంస్కృతాన్ని ప్రయోగించడం, విసురు, ఊపు మొదలైనవి బాగా పాటించడం, వీటి ప్రాధాన్యాన్ని తెలుపుతై. ఇప్పుడుదాహరించిన పాదాల్లో చైతన్య ధనుష్ప్రాణులు, ప్రయోజన నిశిత బాణులు - అనే చోట్ల రూపకాల్లో సాయుధ పోరాటం కూడా ధ్వనిస్తోంది. అడుగడుగునా ఇన్ని ప్రయోజనాలతో కుందుర్తి రచన సాగుతుంది.

'తెలంగాణా' అనేక శిల్పరీతుల్ని ప్రదర్శించి, ప్రజాచైతన్య పురోగమనానికి తగిన రీతిగా వచన గేయాన్ని మలుచుకొన్న ఒక గొప్ప ధ్వనిమయ కావ్యమనీ, ఆధునిక వచనగేయ కావ్యాల్లో ఈ కావ్యం విశిష్టస్థానాన్ని పొందుతుందనీ చెప్పడమే నా లక్ష్యం.

కథాకావ్యాలు వచనగేయాల్లో రావాలని కుందుర్తి కోరేది యింత విశాల పరిధి రచనారంగానికి చేకూర్చడానికే. "దండియాత్ర"లో కూడా రెండు మూడు శిల్పరీతుల్ని సూచించి, ఈ కథాకావ్య వివరణ ముగిస్తాను. "దండియాత్ర"లో అతి స్పష్టంగా గాంధీజీ నాయకుడు. ఆయన గుణాల్నీ, ప్రజల్లో తెచ్చిన చైతన్యాన్నీ స్ఫురింపజెయ్యడం కవిధ్యేయం. "సముద్రం త్రాగబోయిన వాడు" అనే ఖండంతో ఈ కథ మొదలౌతుంది. మొదటి ఖండంలో ఎక్కడా గాంధీజీ పేరు చెప్పడు. గాంధీ అట్టడుగు మనిషిలో (దాసరి పెరుమాళ్ళు) కలిగించిన చైతన్యాన్ని వర్ణించి, ఆయన నాయకత్వంలోని గొప్పతనాన్ని ధ్వనింపజేస్తాడు. పైగా ఈ దాసరి పెరుమాళ్ళు-

నిజానికి ఆతనంత పిరికివాడు
ఆ చుట్టుపక్కల ఎక్కడా ఉండడు
ఆతనంత సంసార తాపత్రయంగాడు భూమండలంలోనే ఉండడు
.........
ఎవరేమన్నా చిరునవ్వుతో జవాబు చెప్పే మెత్తనివాడు
అందరికీ తలమీద మొత్త బుద్ధి అయ్యేవాడు"

అటువంటివాడు, సంసారాన్ని వదిలేసి, ఉద్యమంలోకి దూకడాన్ని వర్ణించి, గాంధీజీ నాయకత్వపు మహత్వాన్ని అతిశక్తిమంతంగా స్ఫురింప జేశాడు. మూడు ఖండాల తర్వాత పెరుమాళ్ళు కథ మళ్ళీ వస్తుంది. ఈ లోపల పెరుమాళ్ళు మాట మనం మరచిపోతాం. పాఠకుడు కవిని అడిగినట్లు ఒక చమత్కారం కల్పించి, అతణ్ణి మళ్ళీ కథలోకి లాక్కొస్తాడు,

''అదంతాసరేగాని అక్కడ పెరుమాళ్ళ సంగతి చెప్పండి
తప్పుతుందా చెప్పకుండా! మీకేం పాఠక మహారాజులు''

ఇది కథ చెప్పడంలో ఉత్కంఠని పోషించే గడుసుదనం. ప్రకృతిని కథతో అభిన్నంగా వర్ణిస్తూ, పఠిత హృదయం కదిలించడం కూడా కుందుర్తి, సంప్రదాయాన్ని ప్రజాపరం చేసిన ఒక శిల్పం. గాంధీజీ ఉప్పు సత్యాగ్రహ సమయంలో సముద్రాన్ని సమీపిస్తున్నప్పుడు, సముద్రాన్ని వర్ణించిన తీరు కథలో ఎంత సమ్మిశితమై పోయిందో చూడవచ్చు :

''మహోన్నత హిమగిరి శిఖరాల హర్షాశ్రుబిందువులు కారి
గంగై పారాయి కాబోలు బంగాళాఖాతానికి కబురెళ్ళింది
అక్కడినుండి అలలు వెళ్ళి అరేబియా సముద్రానికి చెప్పాయి
అది తక్షణం తయారైంది అవతారమూర్తిని ఆహ్వానించడానికి
ఒడ్డులొరసి దూకుతున్న అలలు అర్ఘ్య పాద్యాలు యివ్వాలి
సముద్రపు చల్లగాలి ఎదురెళ్ళి స్వాగతం యివ్వాలి
అన్ని ఏర్పాట్లు పూర్తయ్యాయి, ఆయన రావడమే తడవు
ఆనందంతో తను పెరిగింది ఆకాశమంత పొడవు''

ఈ సుదీర్ఘపాదాల శైలి కూడా ప్రవాహోలు జాలువారిన స్ఫురణను కల్గిస్తున్నై. ప్రజాచైతన్యానికి, చరిత్ర పురోగమనానికి, ఆయన కథారూపాల నివ్వడం, అందులో ఎన్నోరకాలైన శిల్పరీతుల్ని అవలంబించడం- అనే విషయాలకి చాలా స్థూలమైన ఉదాహరణ లివ్వబడినై. వచనగేయంలో కథాకావ్యాలు వస్తే, సామాజిక చైతన్యాన్ని వర్ణించడానికి పరిధి చాలా విశాలం కాగలదన్నదే కుందుర్తి వాదన. తెలంగాణా, దండియాత్ర- కావ్యాల్లో ఆ సత్యాన్ని ఆయన ఋజువు చేశారు.

### కుందుర్తి — వచనగేయ నాటకాలు :

వచనగేయ రూపాన్ని అన్ని ప్రక్రియల్లో వినియోగించుకోవాలనీ, అది అన్ని ప్రయోజనాలకూ ఒదుగుతుందనీ, ఒక ప్రత్యేకత కనబరుస్తుందనీ కుందుర్తి ఆశయం. ఆ ఆశయం మేరకే ఆయన ఆశ, ఆచార్లగారమ్మాయి, శిక్ష ఏమిటి?- అనే మూడు వచనగేయ నాటకాల్ని రాశారు. మూడిటిలో సామాజిక

పురోగమన చైతన్యమే ఆయన వస్తువు. మూడిటిలోను దోపిడీ చేసేవాళ్ళు, చెయ్యబడేవాళ్లు- అనే యిద్దరికి సంబంధించిన ఘర్షణ ప్రధానం. "ఆశ" లో కార్మికుల సమ్మె చెయ్యడం, వారికి నాయకుడుగా నటించినవాడు పెద్ద పదవిలోకి పోగా, కపిసమ్మెలో దగి ఉద్యోగం కోల్పోయి, దిగాలుపడగా, ఆశ, అతనిలో ఆశ కలిగించడం, భవిష్యత్తు మీద ఉజ్వలదృష్టి కలిగించడం కథ. "ఆచార్ల గారమ్మాయి"లో ఒక కామాంధుడు, ఉన్నత వర్గం వాడు ఒక స్త్రీ శీలాన్ని దోచుకోగా, ఆమె ఆత్మహత్య చేసుకుందని అందరూ అనుకోడం, చివరికామె అనాథ శరణాలయంలో చేరినట్లు తెలియడం ప్రధాన వస్తువు. "శిక్ష ఏమిటి" లో హరిజనులకు కాలనీ కట్టిస్తాననే మిషతో డబ్బు మింగేసి, కట్టించకుండా వాళ్ళందర్నీ మోసం చేసిన కంట్రాక్టరుకి ప్రజలు ఏం శిక్ష వెయ్యాలి? అని కవి ప్రశ్నించడం కథావస్తువు. ఈ మూడిటిలో 'ఆశ' లో కాలం, చరిత్ర మొదలైన పాత్రలుంటై. నాటక గమనంలో చమత్కారమూ, Symbolism ప్రధానంగా ఉంటై. 'ఆచార్ల గారమ్మాయి'లో చమత్కారం చాలా ముఖ్యపాత్ర వహిస్తుంది. 'శిక్ష ఏమిటి?' లో చమత్కారం తక్కువ, అభ్యుదయ కథావస్తు ప్రాధాన్యం ఎక్కువ. ఏదైనా, నాటకాల్లో Symbolism గానీ, కవినీ, సూత్రధారుణ్ణీ, ఒక్కొక్కచోట ప్రేక్షకుల్నీ ప్రవేశపెట్టడంగానీ, నాటకానికి కొంత కవితాలక్షణం సమకూర్చడానికి కవి చేసిన ప్రయత్నంగా కనిపిస్తుంది.

నాటకం అభినయ ప్రధానమైనది. సంభాషణలన్నిటిలో కవిత్వం గుప్పిస్తే, అది ప్రదర్శనానుకూల్యాన్ని పూర్తిగా కోల్పోతుంది. మామూలు వచనంలోనే రాస్తే, కవితానాటకం అనే ప్రత్యేకత పోతుంది. అందువల్ల, ఇట్లాంటి కవితానాటకాల్లో సంభాషణ రచన కత్తిమీద సాములాంటిది. కుందుర్తి మిగిలిన వచనగేయాల్లోనూ, వచనగేయకథాకావ్యాల్లోనూ అనుసరించిన శైలికీ, ఈ నాటకాల్లో అవలంబించే శైలికీ చూపించిన భేదం చాలా ముఖ్యంగా గమనించదగినది. వీటిల్లో కవి, కాలం, చరిత్ర మొదలైనవి కొంచెం కవిత్వంతో కూడిన భాషలో మాట్లాడ్డం, మిగిలిన పాత్రలు మామూలు మాటలకంటె చాలా కొంచెం మాత్రమే ఉన్నతమైన వచనం మాట్లాడ్డం, కుందుర్తి జాగ్రత్తగా అనుసరిస్తాడు. ఈ వచనాన్ని భావసమగ్రతని బట్టి, పాదాలుగా విరవకపోతే, అభినయానికి చాలా అవకాశం ఉన్న, ఉన్నత వచన పంక్తులుగా ఉంటై. కవి మొదలైనవాళ్ళు మాట్లాడే భాషకికూడా, తాను మిగిలిన వచన గేయాల్లో

ప్రయోగించే ప్రాసలూ, యతులూ, అంత్యప్రాసలు, రూపకాలూ విపరీతంగా ప్రయోగించడు. అట్లా చేస్తే, నాటకీయ భ్రాంతి పూర్తిగా పోతుంది. అందుకే వచనగేయ నాటకంలో సంభాషణలు రాయడం కత్తిమీద సాములాంటిది కుందుర్తి ఈ విషయంలో పూర్తిగా విజయం సాధించారని చెప్పలేముగాని, మార్గ దర్శకుడై నాడనడంలో సందేహం లేదు. సి. విజయలక్ష్మి వ్రాసిన "విషాద భారతం" మొదలైన వచన కవితానాటకాలు, బాగా పరిణతి పొందిన శైలిని ఏర్పరచుకొన్నై.

**కుందుర్తి :**

ఇట్లా కుందుర్తి వచనగేయకవితా నిర్మాణంలో కొన్ని నిర్దిష్ట సిద్ధాం తాల్ని ఏర్పరచుకొని, వాటి కనుగుణంగా తన కవితా జీవితాన్ని సాగిస్తున్నవారు. తన కొక ప్రత్యేకమైన దారిని సృష్టించుకొన్నవారు. ఆ స్పృహతోనే ఈ మాటలంటారు:

"ప్రయోజనం తండ్రి : పరమసౌందర్యం తల్లిగా
పలికే ప్రతి వాక్కు రసానంద కల్పవల్లిగా
నా దారి నాది" (నాలోని నాదాలు)

కవిత్వాన్ని జీవితంతో కలిపి సమన్వయించుకునే విశిష్టప్రవృత్తి కొద్దిమందికే ఉంటుంది. దాన్నే చిత్తశుద్ధి అంటాం. 'నాలోని నాదాలు' లోనే కవి, తన ఆత్మనిట్లా ఆవిష్కరిస్తాడు:

"కాని కవిత్వం ఒక్కటి ఉంది
కదలనియ్యదు, మెదలనియ్యదు
మెత్తగా చేస్తుంది మెదడును
జాలి ఒత్తితో మండిస్తుంది గుండెను"

మొత్తంమీద కుందుర్తి గతాన్ని ద్వేషించకుండా, అందులోనుండి వర్తమానాన్ని సహజంగా పరిణమింప జెయ్యడానికి కృషిచేసిన సాత్విక విప్లవకారుడు.

"గతంచూసి గర్వించడం మంచిదే
కాని ప్రస్తుతం పఠించడం మరీమంచిది

గతం విస్మరించడం తప్పే
కాని పట్టుకు ప్రేలాడ్డం మరీ తప్పు''

తనకు సంక్రమించిన సంప్రదాయాన్నంతటినీ, ఆధునిక వచన గేయంగా మలచి, సామాజిక చైతన్య ప్రయోజనాన్ని పరమ లక్ష్యంగా పెట్టుకుని, భాషా, భావనా, శిల్పరీతులన్నీ దానికే అంకితం చేసిన ''అచ్చమైన ప్రజాకవి'' కుందుర్తి.



# సి. నారాయణరెడ్డి

డా॥ అమరేంద్ర

ఆంధ్రరాష్ట్రం అవతరించిన శుభతరుణం అది. మా గుంటూరు హిందూ కళాశాల ప్రాంగణంలో వైభవోపేతమైన సాహిత్య సభ. శివశంకరస్వామి, రాయప్రోలు, జాషువా, కరుణశ్రీ. గోపీచంద్ ప్రభృతులు వేదికమీద ఆసీనులై వున్నారు. ఒక మూల ఒదిగి కూర్చున్నాడొక తరుణకవి. నూనూగుమీసాల నూత్నయౌవనం. స్నేహదీపికలు వెలిగించే మధుర మందహాసం. ఉంగరాల ముంగురులూ, బంగరు గంటలు మోగినట్లు సభ్యులను పారవశ్యంలో ముంచివేసే కంఠస్వరమూ. సభ ముగిసిన తరవాత ఆయన సోదరోపహారం అంటూ ఒక చిన్న పుస్తకం నా చేతికి అందించి వెళ్ళిపోయారు. దాని పేరు "నవ్వని పువ్వు". ఆ నాడు సిగ్గుల మొగ్గగా, నవ్వని పువ్వుగా కనబడిన నారాయణరెడ్డి ఈ నాడు నవ్వే పువ్వుగా, నవ్వించే పువ్వుగా అధునికాంధ్ర కవితా వన వాటికలో శోభామయ అనార్తవ ప్రసూనంగా శోభిస్తున్నారు. ఆయన కోమల కవితా సౌరభం దిగంతాలు వ్యాపించింది.

ఈ శుభ పరిణామం నిరంతర సాహిత్య వ్యవసాయానికి ఫలసాయం. సాధించిన విజయాలతో తృప్తిచెందక ఇంకా సమున్నత శిఖరాలు అధిరోహించాలనే జిగీష ఆయన శేముషికి ప్రముఖ లక్షణం. అందుకే నిర్విరామంగా, నిత్యనూతనంగా ఆయన కవితావ్యాసంగం సాగిపోతున్నది.

ప్రతిభాశాలియైన కవి తన మనోధర్మానికీ, యుగధర్మానికీ అనుకూలమైన రచనా శిల్పం రూపొందించుకోవాలి. సంప్రదాయసిద్ధమైన పద్యరచనమీద అభిమానం వున్నప్పటికీ తన హృదయస్పందనకు అనుగుణమైన మాత్రాఛందస్సుమీద మక్కువ చూపటంలో నారాయణరెడ్డిగారి ప్రత్యేకత కనబడుతుంది. కవితాశ్రీకి వెలుగుల మేడగా, గురజాడను స్తుతించి, ఆయన రాయంచ నడకలు నేర్పిన మాత్రాఛందస్సును అందుకొని రవ్వలు రాల్చి ఆంధ్రవాణికి గరగరల్ పచరించిన సుకుమార కవి నారాయణ రెడ్డి. ఆ నడకలలో ఎన్ని పోకడలు పోయి ఎన్ని పొగసులు చూపవచ్చునో అవన్నీ నాగార్జున సాగరం, కర్పూర వసంత రాయలు, విశ్వనాధనాయుడు, సమదర్శనం, వెన్నెలవాడ వంటి కృతుల్లో ఆయన

ప్రదర్శించి గురజాడ సాగిన వెలుగువారిలో ఆయన అలత నెరుగని బాటసారి అయినారు. ఛందస్సుల అశ్వహృదయం గ్రహించిన తరువాతనే స్వచ్ఛంద గమనంకోసం ఆయన ప్రయత్నించారు.

గమనశీలమైన ఆధునిక యుగంలో కవి భావనకు నూతనమైన అభివ్యక్తి ఆవసరమని ఎజ్రా పౌండు ఇల్లా అన్నాడు.

"The age demanded an image
Of its accelerated grimace...
Not, not certainly the obscure reveries
Of the inward gaze

Better mendacities
Than the classis in paraphrase

The age demanded a mould in plaster
Made with no loss of time
A prose kinema, not not assuredly alabaster
Or the sculpture of rhyme''

ఈ సత్యాన్ని మొదటనే గుర్తించిన గురజాడ ''కొయ్యబొమ్మలు మెచ్చు కళ్లకు కోమలుల సౌరెక్కునా?'' అని ప్రశ్నించారు. ఆ కోమల కవితా విన్యాసాన్ని గుర్తించిన నారాయణరెడ్డి హృదయస్పందన వినిపించే రచనా శిల్పం అలవరచుకొని రాలలో పూలు పూయించి కాలాన్ని బందీని చేయగల కళాదేవతల కడాని చూపుల చలవతో బండలలో గుండెల సవ్వడులు వినిపించగలిగారు.

సత్కవి జాషువా ''సమస్త లోక మంగళకరమైన సత్యమును కమ్మని వాక్కుల నిర్భయమ్ముగా పలుకునదే కవిత్వ మని'' నిర్వచనం చెప్పారు. అటువంటి సత్యాన్ని ప్రతిపాదించే కవిత్వం సకల మానవ మానసముల సామ్రాజ్యమ్ము సలుపగలదన్నారు. ఇటువంటి కవిత హృదయాలు దయారామాలుగా వికసించటానికి అమృత వర్షధార. ఎల్లలన్నీ కల్లలని చాటుతూ, లోకమంతా ఒకే యిల్లుగా భావించగల విశాలదృష్టి వున్నప్పుడే కవితకు విలువ. అంతేకాని

మాటల గారడీ వల్ల ఉత్తమ కవిత్వం సృష్టి కాదు. కవులలో స్థూలంగా రెండు తరహాలవారు కనిపిస్తారు. కొందరు బుద్ధివాదులు. మెదడుకు పదును పెట్టి లోతుగా ఆలోచింపజేయగల కవిత్వం రాస్తారు. మరికొందరు హృదయవాదులు. భావావేశంతో హృదయాలను ఉర్రూతలూగిస్తారు. ఉత్తుంగ శృంగాలనుంచి ఉరికి పడే జలపాతంలాగా వుంటుంది వాళ్ల కవిత. నా దృష్టికి నారాయణరెడ్డి హృదయవాదిగా కనబడతారు. అందుకే "ఇరుగుండియ లొక సూత్రపు విరులై కూడిన చాలును, పొంగి నింగి నందుకొందు భూదివమ్ము లతికినట్లు'' అన గలిగారు. ఆయన మనుగడలోనూ కవితలోనూ ఈమైత్రీసూత్రమే అంతస్సూత్రంగా గోచరమౌతున్నది. సకల చరాచర ప్రకృతినీ ఏకం చేస్తున్న పవిత్ర బంధమే ఈ మైత్రి. బురదలో వున్న పురుగునూ స్వర్గంలో వున్న పరమాత్మతో అనుసంధించే మధుర బంధం ఈ మైత్రి అన్నాడు షెలీ కవి. ఇదే విశ్వప్రేమగా పరిణమిస్తుంది. సకల నీతి శాస్త్రాలకూ ప్రేమయే పునాది, అదే మర్మ రహస్యం అని గ్రహించి ప్రేమ తత్త్వ ప్రబోధం చేసే హృదయవాది కవులలో నారాయణరెడ్డికి విశిష్ట స్థాన మున్నది.

ఈ ప్రేమ తత్వం వ్యక్తులకు పరిమితం కాదు. అది తాత్కాలికమైన బాహ్యసౌందర్యం మీద ఆధారపడదు అందుకే లకుమాదేవి సకల సృష్టికి ప్రతీకమై నిలిచింది.

''పృథివి నాయమ జఘనపీఠమ్మునం గాంచి
జల మామె కంటి పాపల లోతులం జూచి
తేజమ్మ నామె ముఖ రాజీవమున నెంచి
వాయుగతి నామె నిశ్వాసములందు గమనించి''

వసంతరాయలు ఆమె ఊదిన ఊపిరిగా నృత్తరత్నాకరం రచించినట్లు కవి పేర్కొనటం వల్ల వారి ప్రణయం విశ్వమంత విశాలమై పోయింది.

''నీవొక నాగస్వరమవు
నేనో నాగిని మాత్రము
ఇరువుర నేకము చేసెను
ఏదో అంతస్సూత్రము...
నీవు నిండు చందురుడవు

నేనో కల్వల చెల్వను
పరిమళ సోపాన పంక్తి
ఇర్వుర నేకము చేసెను''

అనే రూపకాల ద్వారా నరనారుల శృంగారం ప్రకృతీ పురుషుల ప్రణయలీలకు ప్రతిబింబమనే తత్వాన్ని సూచించారు. ఈ దృష్టితోనే కాల్పనికకవులు శృంగారాన్ని పవిత్రంగా ఉదాత్తంగా అమలినంగా చిత్రించారు. అందుకే కవిశేఖరులు శ్రీ అరవిందులు "Our lives are their heart-beats, our rapture the bridel of Radha and Krishna, our love is their Kiss'' అన్నారు. ఇటువంటి సముదాత్త ప్రణయతత్వం ప్రతిపాదించే "కర్పూర వసంతరాయలు'' కావ్యమంటే నాకు ప్రాణం.

ఒకనాడు నేనొక కిరాణా కొట్లో సరుకులు కొనుక్కోటానికి నిలబడి వున్నాను. పొట్లాలు కట్టటానికి సిద్ధంగా పెట్టుకున్న పాత కాగితాల దొంతరలో తటాలున ఒక కాగితం కనబడింది. రచనపేరూ రచయితపేరూ ఆ కాగితం ముక్కలో కనబడలేదు. అభిరుచిలేని చదువరి ఎవరో కక్కుర్తిపడి అమ్మివేసి వుంటాడు. ఆ పంక్తుల విలువ తెలుసుకోలేకపోయి ఉంటాడు.

"నాకు జూడ బ్రహ్మాండమె
ఏకైక కరండకమ్ము
దానిలోన స్నేహరమ్య
మై నిల్చెను పరంజ్యోతి''

అనే గేయభాగ మది. కొంతకాలానికి ఈ పంక్తులను నారాయణరెడ్డిగారి ఋతుచక్రంలో కనుగొని ఎంతో మురిసిపోయాను. పరమాత్మని ప్రణయ మాధుర్య దీప్తిని అక్షరాలలో మెరిపించిన కవితా కౌశలాన్ని మనస్సులో అభినందించుకున్నాను. ఋతువులు తిరుగుతూ వుండటంవల్ల ప్రకృతి సౌందర్యంలో గోచరించే కొత్త వింతల అందచందాలను కాళిదాసు కళ్ళతో కాకుండా సొంత కనులతో చూసి, సొంత గొంతుకతో వినిపించిన ప్రతిభాశాలురైన భారతీయ కవులను వేళ్లమీద లెక్కపెట్ట వచ్చును. ఆ కోవలో ఠీవిగా నిలబడగల కవితా శిల్పి నారాయణరెడ్డి.

శిల్పమంటే జ్ఞాపకం వస్తుంది, మూగకవిత్వం శిల్పం; మాట్లాడగల శిల్పం కవిత్వం అన్నాడొక కళారహస్యవేత్త. ఉత్తమ కవులందరూ [illegible]

శిల్పులే. "I look upon fine Phrases like a lover" అని కీట్సు కవి సుకుమార సుందరశబ్ద సంపద మీద తన కెంత మమకారమో చాటించాడు.

"భాషే నేను తెచ్చుకున్న తీయని వరం
భాషే నేను కట్టుకున్న జీవన గోపురం"

అన్నారు నారాయణరెడ్డి

"సురభిళ శబ్ద మ్మొక్కటి తరగెత్తిన చాలు
నా యెడంద సందులందు కోటి
నందనాలు గుబాళించు"

అనే శబ్దశిల్పి ఆయన. మాటలలో అర్థమే కాకుండా రంగూ, రుచీ, సువాసనా, సంగీతమూ గుర్తించ గలవారే గేయకవులుగా రాణించగలరు. ఆకాశవాణి ద్వారా వినిపించే లలిత సంగీతంలో నారాయణరెడ్డి గేయాలు ఎక్కువ ఆదరం పొందాయి. ఆటు తరవాత వెండితెర మీద ఆయన పాటలు సన్నివేశాలను జత చేసుకుని ఆంధ్రదేశంలో విస్తారమైన ప్రచారం సంపాందించుకున్నాయి. వాణిజ్యసూత్ర బద్ధమైన సినీసాహిత్య రంగంలో వాణీపాద మంజీర శింజానాలు నినదించే గేయాలు కొన్ని అయన రచించారు. అయన శబ్దశిల్పానికి అవి జయ పతాకాలు. ఒకచోట అమాయకపు జానపదులు తేటతెలుగులో తీయగా ముచ్చటలాడుతున్న ట్లనిపిస్తుంది.

"దాచేస్తారా తిండిగింజలను
ఎక్కడిదీ న్యాయం?
మా ఆకలిముందు
మా అలజడిముందు
దోపిడి దొరల ఆటలు బందు."

అని హెచ్చరిక చేసినా

'ముళ్ళలాగ ఎవ్వరినీ నొప్పించవద్దు
పూలలాగ అందరినీ మురిపిస్తే ముద్దు'

అని హితవు చెప్పినా అలతి అలతి తెలుగు పలుకుల కులుకులు కనిపిస్తాయి. మరొకచోట ఎవరో ప్రౌఢప్రబంధకవి దిగివచ్చి గీర్వాణ పదబంధాలను అలవోకగా విసిరివేస్తున్నట్లు తోస్తుంది.

''చందనశీతల మందమందమక
రంద మధుర సంభాషిణీ
నవ్యదివ్య సంగీత సాహితీ
నయన యుగళ సంశోభినీ!"

అని వాణిని స్తుతించినప్పుడు,

''ప్రమధ నాధకర పంకజ ఖాంకృత
డమరుధ్వని వినిపించగా
ప్రళయకాల సంకలిత భయంకర
జలధరార్భటుల చలితదిక్తటుల
చరిత దిక్కరుల వికృత ఘీంకృతుల"
ప్రళయ తాండవం సూచించినా''

"నీవే నాదానివీ, నా దానివీ'' అని చేమకూర వెంకట కవిలా విరిచినా అణువణువునా శబ్దాలమీద ఆయన సార్వభౌమాధికారం చెలాయిస్తున్నట్లు గోచరిస్తుంది, ''నా ఇంటి వివృతగవాక్షం భాష, నా కంటి నిర్మల కటాక్షం భాష'' అన్నమాట అక్షరాలా నిజం.

తన ప్రత్యేకతను చాటుకుంటూ ''నా పేరు కవి; ఇంటిపేరు చైతన్యం'' అన్నారు. ప్రతి జీవిలోనూ ఒక కదలిక వుంటుంది, అందని ఆకాశాలను చేతులతో తాకాలనే ఆశ వుంటుంది.

"we look before and after
And pine for what is not"

అన్నాడు షెలీకవి. ఈ ఆరాటమే చైతన్యం. ఇది వ్యక్తిలోనూ సమాజంలోనూ వెల్లివిరిసినప్పుడే జాతి ముందుకు సాగుతుంది. లేనప్పుడది వేసిన చోటనే పడివుండే గొంగళి. రవీంద్రులు అటువంటి జడస్థితినే ''అచలాయతనం'' అనే ప్రహసనంలో అధిక్షేపించారు. జడతకు అలవాటుపడిన జనతను వెన్నుతట్టి లేపటమే కవి వైతాళికుల కర్తవ్యం.

''బ్రతుకంటే ఉద్దీప్త చైతన్యం
జలవిద్యుత్తుతో దాని బాంధవ్యం
బ్రతుకంటే వర్షామేఘం
బీళ్ళతో ఏళ్ళతో దాని అనుబంధం''

అంటూ చైతన్య శక్తిని ప్రశంసించారు. ఈ చైతన్యశక్తి విజృంభించాలనీ,

"శప్తనలుడు దవానలుడై
బృహన్నలుడు పురానరుడై
మతి మాసిన సగటుమనిషి
హేతువాద గదాధరుడై"

ఉజ్జ్వలంగా జీవించే శుభ ముహూర్తం కోసం కవిహృదయం నిరీక్షిస్తుంది. దేనినీ విసర్జించని సమన్వయ దృష్టితో చైతన్యస్ఫూర్తి వున్న ప్రతి వస్తువునూ కవి స్వీకరించాలి. "I accept all, I reject none. Do I contradict myself? yes. I contain multitudes" అని walt whitman కవి అన్నట్లుగానే-

"పంచేంద్రియాల పరిష్వంగంలో
ప్రపంచాన్నే పొదుగుకోండి"

అన్నారు నారాయణరెడ్డి. సమస్త విశ్వాన్ని తన బాహుబంధంలో ఇముడ్చుకున్న కవికే "ఆకాశం మాతృభాష మౌనం, అంభోధి మాతృభాష గానం" అంతటా చైతన్య సంచలనమే. అటువంటి ప్రదీప్తదృష్టికే-

"అకుంఠిత సంకల్పానికి అపరాకృతి ఓజస్సు
అక్షత లక్ష్యానికి అక్షరస్థితి ధనుస్సు"

అటువంటి దృష్టికి అడ్డుగోడలు లేవు, ఆటంకాలు లేవు. ఆగకుండా సాగిపోతూ వుండటమే దాని లక్షణం. ఉజ్జ్వలభావ విభాస్వరిగా, జననాన్నీ మరణాన్నీ జయించే అమృతాక్షరిగా చైతన్య స్ఫూర్తిని ఉద్బోధించే కవిత మెరిసిపోతుంది. అటువంటి కవితకు ఆశయే శ్వాస. అదే జీవిత ఛందస్సుకు అందాలు సంతరించే అనుప్రాస.

"ఈ రాత్రి చివరి ఊర్పులో
రేపటి ఎర్రటి తూర్పులో వస్తానునేను, పుట్టుకొస్తాను నేను
వట్టిపోయిన చెట్లులో చిగుళ్ళ చైతన్యంలాగా
కీకాటవిలో అల్లుకుపోయే కిరణసైన్యంలాగా"

అంటున్నాడు కవి. అజరామరమైన ఆశావాదంతో, జడప్రకృతితో తాను సాగించే అనవరత అకుంఠిత రణం అంతిమవిజయం సాధిస్తుందనే స్థిరవిశ్వాసంతో, "Hope till hope creates, Of its own wreck the thing it

Contemplates" అన్నాడు ఆశావాద కవి చంద్రుడు షెలీ తనచుట్టూ అలుముకున్న దట్టపు చీకట్లకు బెదిరిపోకుండా.

"పిచ్చివరదలు పచ్చిగుండెను
లక్షసార్లు ముంచేసినా
ఇంకా ఏదో నిలిచివుందని
ఇంకిపోని ఆశ పలుకుతుందని
జడీభవించిన జీవితంలో
చైతన్య ఋతువు మొలుస్తుందని
ఇప్పటికీ నమ్ముతున్నాను"

అంటారు ఆశావాది నారాయణరెడ్డి. "O wind! if winter comes can spring be far behind?" అన్నట్లు ఈ చైతన్య ప్రబోధం, ఈ ఆశావాదం మనస్సుకు "చరైవేతి చరైవేతి" అనే ఉపనిషద్వాణిని జ్ఞాపకం చేస్తాయి. ఇంకొక విశిష్టలక్షణం కాలాన్ని గురించిన భావన.

"Time past and Time future
Are perhaps present in time present"

అనే సత్యాన్ని పూర్తిగా కవి ఆకళించుకున్నారు. కాలప్రవాహపు ప్రబలవేగానికి అనుగుణంగా తన కవితాగమనాన్ని శృతి చేసుకున్నారు. గతాన్ని నిరసించకుండా వర్తమానాన్ని గుర్తిస్తూ భవిష్యత్తులోకి ప్రసరించే సమన్వయ దృష్టి ఆయన కవిత కొక వింత సోయగం "ముల్లోకాలనూ వడబోసే నేత్రాన్ని, సంప్రదాయాన్ని జీర్ణించుకున్న ప్రయోగాన్ని, ప్రయోగంలో జీవిస్తున్న సంప్రదాయాన్ని" అని చాటుకున్నారు. "గిరిలాంటి స్తబ్ధతనుంచి ఎగిరిదూకే అగ్ని జలపాతం" లాగా ఆయన భావన గతం నుంచి అనాగతానికి పరుగులు తీస్తుంది. ఏనాడో అంతరించిన రామునిరాజ్యమునూ రాయల స్వర్ణయుగమునూ తలచుకుంటూ "బెంగ పడకుండా" నిన్నటి నుదుట రేపటి తిలకం హత్తించే" క్రొత్త నెత్తురు పొంగే కవితను అందించగలుగుతున్నారు. ఆధునికాంధ్రకవిత్వంలోని సంప్రదాయం ప్రయోగం అనే ప్రశస్తమైన పరిశోధనా ప్రబంధంలో తమ నిశిత పరిశీలనాశక్తిని ప్రదర్శించారు. "ఎవరూ చదివి వుండని పుస్తకాలనుంచి విషయ సేకరణచేసి ఎవ్వరూ చదవలేని పుస్తకం రాయటమే సాహిత్య విమర్శ" అని ఒక మేధావి అధిక్షేపించాడు. కాని నారాయణరెడ్డిగారి పరిశోధనాగ్రంథం పలు

వురు చదువరుల మెప్పును పొందగలిగింది. సరళమైన రచన సరసమైన భావనా వైఖరి ఈ గ్రంథానికి ప్రత్యేకమైన స్థానం సంపాదించిపెట్టినవి.

"కవిత్వం నా మాతృభాష

ఇతివృత్తం మానవత్వం" అని చెప్పుకుంటున్నారు. అంటే-
అతి సామాన్య వస్తువును కూడా ఒక వింతకోణంలోంచి చూసి దానికి భావనల మేలిముసుగువేసి కొత్త అందం సంతరించగల రసదృష్టి వున్న వాడికే కవిత్వం మాతృభాష కాగలదు. "హీనంగా చూడకు దేన్నీ కవితామయమేనోయ్ అన్నీ" అన్న శ్రీ శ్రీ వాక్యానికి నిదర్శనం కాదా ఈ చిత్రణ?

"సిగరెట్టు సిగలో మెరిసే
సెగపువ్వు
ఇంధనం అధరంపై విరిసే
ఎర్రనవ్వు"

నిత్యంచూసే వస్తువుల్లో నిగూఢంగా వున్న అందాన్ని చూపే కవులు మనకు కొత్త కళ్లు ప్రసాదిస్తారు.

ఒకసారి నెహ్రూ పండితుడు అన్నాడు-"Whatever Gods there be there is something God- like in Man" సృష్టి పరిణామ పథంలో మానవుడు నిత్యయాత్రికుడు.

"ఎవరీ మనిషి ?
రెండు కాళ్ళ మృగం
శిశుత్వం పశుత్వం చెరిసగం" అనిపించవచ్చును. కాని మనిషి నశించినా నశించదు మానవత్వం. మానవునిలోని దయా, ప్రేమా, క్షమా, స్వార్థత్యాగమూ అతని దివ్యాంశలు; ఆరోహించే మణిసోపానాలు. తాను కాలిపోతున్నా పరిసరాలను సురభిళపూరితం చేయగల త్యాగశీలం మానవుడిని సృష్టిలో మకుటధారిగా నిలబెట్టింది. "ఆశావిపంచికను మ్రోగిస్తూ అనంతంవైపు ప్రస్థానం సాగిస్తూ" మానవత నీరాజనాలు అందుకుంటున్నది.

"తెల్లగా విరిసిన మానవతా !
నువ్వు మృత్యుంజయవు
సత్యప్రియవు

అక్షతవు, అనాహతవు'' అని మానవ మహనీయతను నోరారా కీర్తిస్తారు నారాయణరెడ్డి. హృదయానికీ బుద్ధికీ ఆదర్శానికీ వాస్తవానికీ గతానికీ భవితవ్యానికీ జంతుప్రవృత్తికీ దివ్యలక్షణాలకూ సేతువు ఈ మానవత. అన్యాయాలనూ అక్రమాలనూ అవరోధాలనూ అధిగమిస్తూ పరిపూర్ణత దిశకు పయనించే మానవత విజయభేరి మోగిస్తుంది, గమ్యం చేరితీరుతుంది అనే సంపూర్ణ విశ్వాసం ఆయన రచనల్లో అంతర్వాహినిగా ప్రవహిస్తున్నది. అందుకే జాతిరత్నమైన జవహరు మీద ఆయనకు అపార గౌరవం.

"స్నేహంతో ద్వేషాన్ని గెలవడం కన్న
జీవిత పరమార్థ మేమున్న దని
మజిలీ యెరుగని యాత్ర సాగించిన
మహత్తర సంకల్ప మతనిది
మానవులందరూ కాంతిసంతతిగా మారాలని

మధురంగా నిశ్వసించిన విశ్వాస మతనిది'' అని ప్రశంసిస్తూ పంచవర్ష ప్రణాళికలను పసిడి మెట్లుగా ప్రాజెక్టులను ఆధునిక దేవాలయాలుగా భావించిన అసమాన మానవోత్తముని కావ్యనాయకునిగా వరించారు. మానవ మహాశక్తిమీద ఇరువురికీ అపారమైన ఆదరగౌరవా లున్నాయి, ఇది కూడూ గూడూ గుడ్డలతో తనివి చెందక, అందని ఆకాశాలకు నిచ్చెనలువేసే అరలులేని అరమరికలేని ఇరులులేని చెఱలులేని విశాల లోకం కోసం పలవరించే మానవత.

''నేటి బిందువు మీద నిలిచి
రేపటి సింధువును కొలిచి
విశ్వమంత విశాలంగా పరుచుకుని
వినూత్న వివేక నేత్రం తెరుచుకుని
గ్రహాలను గుప్పిట్లో పట్టుకునే
ముహూర్తం కోసం'' ఎదురుతెన్నులు చూసే మానవత అది.

నవతను తనలో ఇముడ్చుకున్న చిరంజీవి మానవత అసూయా ద్వేషాలూ దురాశా దురాలోచనా విడనాడిన మానవత అది.

''లంకంత ఇల్లున్నా, లక్షపసిడి లోగిళ్లున్నా
అభిరామమైన అనుభూతి లేకుంటే

ఆనందగాత్రి అవనీ పుత్రి లభించదు
ఆత్మతంత్రి రవళించదు''

అంటూ మానవులను మాన్యులనూ ధన్యులనూ చేయగల రహస్య మేదో కవి గొప్పగా సూచిస్తున్నారు.

గొప్పకవులందరిలోనూ నిత్యశైశవం పల్లవిస్తూ వుంటుంది. వయస్సు శరీరానికే కాని మనస్సుకి రాదు. "Heaven lies around us in our infancy" అన్నారు ఆంగ్లకవి. శిశు ప్రవృత్తిలోని నిర్మలత్వమూ అమాయకత్వమూ రాగద్వేషరహితమైన పవిత్రస్థితీ తమ అంతరంగంలో పచ్చగా వెచ్చగా నిలుపుకోగల వారికే ఈశ్వర సామ్రాజ్యం లభించగలదని ఏసుప్రభువు ప్రవచించాడు. తూనీగలను విమానాలుగా, ఇంద్రధనుస్సులను జారుడు బండలుగా తలపోసి మురిసిపోగలది శిశుప్రవృత్తి. ''పాపం పుణ్యం ప్రపంచమార్గం, కష్టంసౌఖ్యం శ్లేషార్థాలూ'' తెలియక ఇచ్చటి కచ్చటి కనుకోకుండా ఎచ్చటెచ్చటికో పరుగులుతీసే పిట్టలు అయిదారేడుల పాపలు.

''దీపం ముట్టిస్తున్నావా పాపా !
పాపచ్ఛాయలు సోకని పాలవ్రేళ్ళతో
ఇరులతో చేతులు కలుపుతున్న మేము
ఎలా దివ్వెలు వెలిగించగలం?
ఇరుకులోయల్లో తలదాచుకున్న మేము
ఎలా నవ్వులు పండించగలం?
ముట్టించు పాపా దీపం ముట్టించు
ముసురుకున్న మా తమస్సును
నీవైనా తుదముట్టించు''

అని ఎంతో ఆవేదనతో శైశవ స్వర్గాన్ని స్మరించుకుంటున్నారు.

చిన్ననాటి జ్ఞాపకాలకు సంకేతంగా నిలిచింది కవి భావనలో పసుల పోశమ్మ.

''ఎవరీ పసుల పోశమ్మ
ఏ తొలివెలుగుల దీపపు సెమ్మ

పత్తిబుట్టవంటి శిరసు
పాలదుత్తవంటి మనసు
కల్ల లెరుగని బోసినోరు
కారుణ్యానికి మారుపేరు''

ఆ ముసిలి పోశమ్మ ఆత్మీయంగా అందించిన అంబలి తాగి పరమానందం పొంది

"చెప్పలేని మధుర స్థితిని, చెరిగిపోని బాల్యస్మృతిని
పచ్చగా నెమరేసుకుంటూ పచ్చికన్నీళ్లు దాచుకుంటూ
గచ్చుమేడరూపంలో వున్న పిచ్చుకగూడు చేరుకున్నా"

అంటారు ఎంతో బాధతో. బుద్ధి ముదిరిన తరువాత చిన్ననాటి జ్ఞాపకాలను గచ్చుమేడల్లో పూడ్చిపెడుతుంది విగ్రవీగే వివేకం. కాని ఆ శైశవ నిర్మలత్వం నిత్యనూతనంగా విలసిల్లే హృదయమే చలిత లలితకవితకు ఆలవాలం. అటువంటి కవులనే జగత్ పారావారతీరంలో పిచ్చుకగూళ్లు కడుతూ పడగొడుతూ ఆటల్లో తేలిపోయే నిత్యశిశువులుగా రవీంద్రగురుదేవులు చిత్రించారు. ''అసివాడిలా పసివాడిలా" పల్లవించే నారాయణరెడ్డిగారి కవితలో ఈ పచ్చదనం ముచ్చటగొలుపుతుంది. ''పాలమీగడ చూపులాంటి పసితనమా!'' అని ఎంతో మక్కువతో సంబోధించారు.

అలనాడు శ్రీశ్రీ అన్నాడు ''గద్యాన్ని పద్యానికిచ్చి పెళ్ళిచేద్దాం, అర్థాన్ని అద్వాన్నపుటడలిలో వొదిలి, డామిట్ ఏమి టిదంటే, ఫ్రీ, ఇటీజ్ పోయెట్రీ అందాం'' ఆయన ఆశించిన గద్య పద్య పరిణయమే వచన కవితగా రూపం పొంది ఈనాడు విశ్వరూపం ప్రదర్శిస్తున్నది. ఈ పరిణామంలో ప్రధానపాత్ర నవకవితాస్ఫూర్తి కుందుర్తిగారిది. ప్రగతిశీలమైన భావాలను స్వచ్ఛందంగా పలికించటానికి వచనకవిత పదునైన సాధనంగా నేడు వినియోగపడుతున్నది. పద్యాల హయాం వెళ్ళిపోయిందనిపించేటంతగా వచనకవిత వేయిరేకులు విప్పుకుంటున్నది. ఆధునిక హృదయస్పందన వచనకవితలోనే సజీవంగా ప్రతిధ్వనిస్తున్నది. వచనకవితలో నారాయణరెడ్డిగారు ఎన్నో ప్రయోగాలు చేశారు. ఎన్నో నడకల సొగసులు చూపించినారు. సాధారణంగా వచనకవితలో పాఠకులను తికమకపెట్టే అస్పష్టత వుంటుంది. కాని నారాయణరెడ్డిగారు సరళత, స్పష్టత, సుకుమారత వచనకవితలో సాధించి తన ప్రత్యేకత చూపించుకుంటు

న్నారు. "ధ్వనుల ధునుల మూసలలో పోసిన సంగీత శతపత్రాలు" గా కొన్ని వచన కవితలు శోభిస్తున్నాయి. అక్షరాల గవాక్షాలు తెరిచి మధ్యతరగతి మందహాసంలో మరో హరివిల్లును దర్శించి తేజస్సుకోసం తపస్సు చేస్తూ మార్పునా తీర్పు అంటూ ఆధునిక యుగంతో ముఖాముఖీ సంభాషించే ఆయన వచనకవిత ఇంటిపేరు చైతన్యం. మంటలు మానవుణ్ణి చుట్టుముట్టినప్పటికీ పరమాత్మకు ప్రతీకగా మనిషిలో దాగిన చిలకను పదిలంగా చూచుకోమని హెచ్చరించే ఆయన వచనకవిత ఎంతో పరిణతిని సాధించింది. శబ్దంలోనుంచి భావం ఎగసివస్తుంది ఒకసారి. భావాన్ని తరుముకుంటూ నేనున్నానని వస్తుంది శబ్దం. ఈ రెంటికీ అభేదం ఆయన వచన కవితలో కొల్లలుగా కనుగొనవచ్చు.

"అశ్రువులందే సుందరహాస మున్నదని తెలిపెను
తొలిప్రొద్దున మంచుబిందువులు రాల్చెడు మల్లెపువ్వు"

అన్నప్పుడు,

"శ్రమజీవుల చెమట బిందువులను
జాతి రత్నాలుగా తలచేది
మంచికి నిలబడ్డ మనిషిని
మహర్షిగా కొలిచేది
విశ్వపటంలో యుగయుగాలకూ
వెండికొండలా నిలిచేది
పొరలుకమ్మని విజ్ఞానం
అరవిందంలా విరిసేది"

అన్నప్పుడూ ఇందులో శిల్పం ఏముంది అనిపించవచ్చు స్థూలదృష్టికి. "Art lies in concealing art" అన్న వాక్యానికి ఇవి నిదర్శనాలు. ప్రాసలూ, అనుప్రాసలూ, అంత్యప్రాసలూ, యతులూ, గతులూ అన్నీ అప్రయత్నంగా వాటి స్థానాల్లో అవి నిలబడిపోతాయి. "నావాదం సామ్యవేదం" అనే ఘంటానాదంతో భరతావనిలో "ఉదయం ఉబుకుతుంది చీకటి తెరలు చీల్చుకుని, ఇది ప్రత్యగ్ర సత్యం మట్టికుదుళ్ళలో సముజ్వలించే మహోగ్రనృత్యం" అని ఆయన వచనకవిత చాటినప్పుడు ప్రసన్నతా, అక్షర రమ్యతా మనసుల్ని అలరిస్తాయి. సాధారణ సత్యాలుకూడా సుందరరూపాలతో ఆణిముత్యాలుగా

మిలమిల మెరుస్తాయి. ఎన్నడూ బెండుపలుకులేని రసార్ద్రరసన ఆయనది. మల్లెచెండుగా ఒకసారి చల్లగానూ ఫిరంగిగుండుగా మరొకసారి కవిగుండెల లోతులనుంచి అక్షయ తూణీరంనుంచి వచ్చే శరపరంపరలాగా దూసుకు వస్తాయి మాటలు. అందుకే ఆయన గేయనాటికలు నందన సుందర సుమవాటికలు. ఆయన గీతిక వసివాడని వాసంతిక నవయుగోదయ సూతిక.

నారాయణరెడ్డిగారి కవిత్వంలో కాల్పనికోద్యమ, మానవోద్యమ అభ్యుదయోద్యమ ప్రభావాలున్నప్పటికీ వాటిని తనవిగా చేసుకోగల ప్రతిభావంతమైన వ్యక్తిత్వమున్నది. రాసిన ప్రతిపంక్తిమీదా ఆ వ్యక్తిత్వమే ఒక ముద్రగా మెరుస్తుంది. ఆయన కవితా ప్రస్థానం అవిరళంగా కొనసాగాలి. కవితా రంగంలో ఇంకా సమున్నతమైన శిఖరాలను ఆయన ఆరోహించాలి. జాగ్రన్మహాగ్నిగా ఆయన హృదయంలో కవిత్వజ్వాల నాలుకలు జాపుతూ వుండాలి. అయిదు పదులు నిండక ముందే ఎన్నో విజయాలు సాధించి విస్తారమైన విఖ్యాతి సంపాదించుకున్నారు. తన ప్రవృత్తికి అనుగుణమైన ఇతివృత్తం ఎంచుకుని ఒక మహాకావ్య నిర్మాణం చేసి భారతీయ జ్ఞానపీఠ బహుమానం పొందాలని నా శుభాకాంక్ష. ఆంధ్ర భారతికి ఆ మహాగౌరవం రెండోసారి దక్కించ గలరని మనసారా ఆశిస్తున్నాను.



# నాయని సుబ్బారావు

'కరుణశ్రీ' జంధ్యాల పాపయ్యశాస్త్రి

* ఆ రోజు సాయంకాలం నరసారావుపేట కాలేజీలో నా ఉపన్యాసం. "కావ్యశిల్పం" అన్న విషయం మీద మాట్లాడాను. "కవి తన కావ్యాన్ని ఎంత అందంగా దిద్ది తీర్చుకుంటాడో అంత అందంగానూ 'ఆకర్షకంగానూ, అర్థవంతంగానూ ఆ కావ్యానికి పేరు పెట్టడం కూడా ఎంతో ఆవశ్యకం" అని చెప్పి ప్రతిమ, కుందమాల, కాదంబరి, కళాపూర్ణోదయం, సౌందరనందం, సౌభద్రుని ప్రణయ యాత్ర ఇత్యాదులు కొన్ని ఉదాహరణ లిచ్చాను.

ఉపన్యాసానంతరం మిత్రులతో కలసి హాలు వెలుపలికి వచ్చాను. ఎదురుగుండా వరండాలో ఒక సన్నని పొడుగుపాటి వ్యక్తి గంభీరంగా నిలబడి ఉన్నాడు. ఒక మిత్రుడు "వారేనండీ మీ సౌభద్రులు" అని ఆయనవైపు చూపించారు. నేను ఆయన ఎవరో అర్థంకాకుండానే "నమస్కారమండీ" అన్నాను. వారు తిరిగి నమస్కారంచేస్తూ "నా పేరు నాయని సుబ్బారావు. మీ ఉపన్యాసం విందామని వచ్చాను. అంతా విన్నాను. చాలా రసవంతంగా ఉంది" అన్నారు. నేను చకితుణ్ణై ఆనందంతో ముందుకు చాచిన వారి చేతులు ముద్దు పెట్టుకున్నాను.

ఆ రోజుల్లో శ్రీ నాయనివారు నరసరావుపేట హైస్కూల్లో ప్రధానోపాధ్యాయులుగా పనిచేస్తూ ఉండేవారు. పేరెన్నికగన్న భావకవుల్లో ఆయన ఒకరు. వారి "సౌభద్రుని ప్రణయ యాత్ర", "మాతృగీతాలు" బాగా ప్రచారంలో ఉండేవి!

శ్రీ సుబ్బారావుగారు మితభాషి. స్మితభాషి, ఆ ప్రసన్నమైన ముఖం- విశాలమైన ఫాలం- ఆప్యాయంగా పలకరించే కళ్ళూ- వాత్సల్యాన్ని చిలకరించే చూపులూ- ప్రథమ దర్శనంలోనే ఆ సాహితీ సౌభద్రుడు నా హృదయాన్ని బాగా ఆకట్టుకున్నాడు.

---

*ఈ వ్యాసం మాకు ఆలస్యంగా అందటంవల్ల చివర చేర్చటం జరిగింది. దీన్ని రెండవవ్యాసంగా చదువుకోవాలి, ఈ అసౌకర్యానికి పఠితలు మన్నింప ప్రార్థన.

నాయనివారు 1899లో జన్మించారు. ఈయన వంశం దాన ధర్మాలకూ భగవద్భక్తికీ సారస్వత సంపదకూ పేరుబడ్డ వంశం. ఆనాటి వాతావరణాన్ని అనుసరించి నాయని భావకవులలో ప్రథమశ్రేణిలో ప్రకాశించారు. సామాన్యంగా భావకవులకు ఒక ఊహాసుందరి ఉంటుంది. ఆవిడ అందదు, తెరచాటున దాగుడు మూతలాడుతుంది. అందీ అందని ఆ సుందరికోసం భావకవి అర్రులు చూస్తాడు. ఆవేదన పడతాడు. పరి పరి విధాల పరితపిస్తూ భావగీతాలు ఆలపిస్తాడు.

''సౌభద్రుని ప్రణయ యాత్ర''లో నాయనివారి కావ్యనాయిక వత్సల. ఈమె అందరి కవుల ప్రేయసులవలె ఊహాసుందరి కాదు. స్వయాన ఆయన మేనత్తకూతురు. శశిరేఖ, అభిమన్యుడు ప్రేమించుకున్నట్టుగానే మేనత్త మేనమామ బిడ్డలైన వత్సల, నాయని ప్రేమించుకుంటారు. పూర్వం బలరాముడు తన కూతురైన వత్సల (శశిరేఖ)ను లక్ష్మణ కుమారుడికి ఇవ్వాలని ప్రయత్నం చేసినట్లుగానే వత్సలతండ్రి కూడా తన కూతుర్ని మరొకరికి ఇవ్వాలని నిశ్చయించుకుంటాడు. మనం ఈ కావ్యంలో శశిరేఖను వత్సలగాను, నాయని వారిని సౌభద్రుడుగాను భావించవచ్చు. భారతంలో లాగానే కొన్నికష్టాలు ఎదుర్కొన్న తరువాత కొంత వియోగబాధ అనుభవించిన అనంతరం ప్రేమించుకొన్న నాయికా నాయకుల సమాగమం సంపన్నమౌతుంది.

''సౌభద్రుని ప్రణయ యాత్ర''లో పైన పేర్కొన్న నాయికా నాయకుల ప్రణయవృత్తాంతం అంతా అత్యంత హృదయగమంగా అభివర్ణితమైంది. ప్రేమించి పెండ్లాడిన దంపతుల ప్రణయ మాధుర్యం అత్యంత మనోహరంగా అనన్యసామాన్యంగా ఉంటుంది. దాన్నే నాయనివారు ''ఫలశ్రుతి'' లో వర్ణించారు.

సంయోగ శృంగారంలో కంటె వియోగ శృంగారంలోనే ప్రణయంయొక్క పరిపూర్ణ స్వరూపాన్ని మనం దర్శిస్తాము. ఏ వస్తువైనా మనం అందుకోవటానికి ముందున్న ఆసక్తి, ఉత్కంఠా అది అందిన అనంతరం ఉండదు. ఆ వస్తువును అందుకోవటానికి చేసిన ఆలోచనలో, భావనలో, ఆశలో, అన్వేషణలో, ఆవేదనలో, ఆరాధనలో ఒక విచిత్రమైన ఆనందం ఉంటుంది.

నాయనివారి భావాలు ఉదాత్తములూ, ఉజ్వలములూ. ఈయన ప్రతి పద్యమూ గుండెలోనుంచి గీల్చుకొని వస్తుంది. అందుకనే ఆ పద్యాలలో అంతటి బాధా, అంతటి ఆవేదనా కన్పిస్తాయి. నాయని ప్రణయమూ హృదయానికి హత్తు

కొనేటట్టు చెప్పాడు. ఈయన కవిత సరళంగా సహజంగా అప్రయత్నంగా పొంగి పొరలుతూ ప్రవహిస్తుంది. నాజూకుగా ఊహిస్తాడు. ప్రాచీన కావ్యాలలోని గాంభీర్యమూ గౌరవమూ వీరి పద్యాలలో ప్రతిబింబిస్తాయి. మృదుపదాల పొందికలో భావాన్ని చక్కగా వ్యక్తీకరించడం ఈయనప్రత్యేకత. ఈయన కవిత్వాన్ని ప్రశంసిస్తూ ''నాయని వ్రాసిందంతా బంగారమే'' అన్నారు కృష్ణశాస్త్రిగారు. ''ప్రతిపదం జీవించే పలుకుతాడు'' అన్నారు ముద్దుకృష్ణ. ''ప్రేమించి పెండ్లాడిన వారి దాంపత్యంలోని మాధుర్యము అనితరమైనది. దాని నీ కవి రసమహితముగా చిత్రించినాడు. పేరునకు 'సౌభద్రుని ప్రణయ యాత్ర' అయినకు ఇందులోని సౌభద్రుడు నాయనివారే. వత్సల మొదట వారి ప్రేయసి. తరువాత ఇల్లాలు'' అన్నారు డాక్టర్ సి. నారాయణరెడ్డిగారు. ఈ క్రిందివి నాయని వారి సుప్రసిద్ధ రచనలు-

1. సౌభద్రుని ప్రణయ యాత్ర 2. ఫలశ్రతి 3. మాతృగీతాలు 4. సౌందర్య లహరి 5. విషాదమోహనము 6. వేదనా వాసుదేవము 7. జన్మభూమి 8. భాగ్య నగర కోకిల.

వీనిలో సౌభద్రుని ప్రణయ యాత్ర, ఫలశృతి శృంగార కావ్యాలు. మాతృ గీతాలు, విషాదమోహనము కరుణ కావ్యాలు. సౌందర్య లహరి, వేదనా వాసు దేవము భక్తి కావ్యాలు. జన్మభూమి, భాగ్యనగర కోకిల దేశభక్తి కావ్యాలు. ఇవిగాక వివిధ ఖండికలతో గూడిన ''ముక్తములు'' అనే ఖండకావ్య సము చ్చయం ఒకటున్నది.

## సౌభద్రుని ప్రణయ యాత్ర

ఈ కావ్యంలో నలుబదియారు శీర్షికలున్నాయి. కావ్యమంతా ఉత్తమపురుషలో ఉంది. నాయిక నామం వత్సల కనుక నాయకుడైన తనను సౌభద్రుడుగా సంభావించుకొన్నారు నాయనివారు. ''సౌభద్రుని ప్రణయ యాత్ర'' కావ్యాన్ని తన ప్రేయసియైన వత్సలకు అంకితం చేస్తూ ఇలా అన్నారు ఆయన:

స్వీకరింపుము ప్రణయదేవీః కరాంచ
లముల జారిన తులసీదళమ్ము లివియు;
నా హృదయరాగసుధయందు నాని చెడని
దివ్య సౌరభ్యముల్ ప్రసాదించుకొనియెః!

తన ప్రణయ గీతాలను అనురాగ సుధలో నాని పరిమళాలు ప్రసాదించుకొన్న తులసీ దళాలుగా రూపించి తన ప్రణయం ఎంత పవిత్రమో నిరూపించుకొన్నారు నాయనివారు. ఆ తులసీదళాలు అంతటి భవ్యములూ పవిత్రములూ కనుకనే దివ్యసౌరభ్యములను "ప్రసాదించుకొన" గలిగినవి.

తన ప్రేయసిని చక్కదనాల చుక్కగా, చిన్నారి మల్లెపూవుగా, కమ్మని మలయమారుతవీచిగా, ఒప్పుల గులాబిగా, కన్నె పికముగా భావించి ఆమె సమాగమం కోసం ఉత్కంఠితుడౌతాడు ఈ కావ్యనాయకుడు. ఐతే ఆ చక్కని చుక్క కారుమబ్బుల తెరబాసి కదలిరావాలి. ఆ మురిపాల మల్లెపూవు మండుటెండలకు కందిపోకుండా తనకు చేజిక్కాలి. ఆ మలయపవన వీచిక ఆ ఉత్తరపు చలిగాలి ఒత్తిళ్ళకు లొంగిపోకుండా వచ్చి తనపై హాయిగా ప్రసరించాలి. ఆ ఒప్పుల గులాబి క్రూరకంటకాల బారినుండి తప్పించుకొని తన కందోయికి విందుచేయాలి. ఆ గానకోకిల ఆ కాకిమూకల కనుగప్పి తన హృదయ రసాలాన్ని చేరి కమ్మగా గానం చేయాలి. అటువంటి మధురక్షణం "ఎప్పుడొ" అని ఎదురు చూస్తాడు.

మినుకు మినుకని మిన్నున మెఱయు చుక్క
కాలరాక్షసుఁ డద్దమ్ము గట్టినట్టి
కాఱుమబ్బులు తెరబాసి కదలివచ్చి
హృదయముం జొచ్చి యట ప్రకాశించు టెపుడొ!

చూడ ముచ్చటయై మనసున ప్రియమ్ము
వెల్లిగొలిపెడు చిన్నారి మల్లెపూవు
మండుటెండకు గందిపోకుండ నాదు
చేతిలోనికి వచ్చి వాసించు టెపుడొ!

నెమ్మనము తాపమడగించు కమ్మతావు
లలముకొనుటలో తనరాక తెలియుచుండ
నుత్తరపుగాలి చలిబాధ కోర్చి మించి
మలయపవనమ్ము నా మీద మలయు టెపుడొ!

ప్రకృతి కాంతాధరరసమ్ము వడియగట్టి
పోతపోసిన ట్లొప్పు నొప్పుల గులాబి

క్రూరకంటకహతి సొంపు గోలుపోక
కన్నులకు విందొనర్చెదు కాల మెపుడొ ।

గానమున పేరు వడసిన కన్నెపికము
క్రమ్ము కాకుల కన్నుల దుమ్ము జల్లి
యిమ్మయిన నాదు చిత్రచూతమ్ము జేరి
ప్రణయ మకరందరసముట్ట పాడు టెపుడొ ।

తెరచాటు బొమ్మయై ప్రేయసి తీయతీయగా చిరునవ్వు నవ్వినది. ఆ నెచ్చెలి మధురమందహాసమే అచ్చుగ్రుద్దినట్లు అతని ఆత్మఫలకమున అతికినది. ఆ చిరునవ్వు ముఖమే నాయకునికి ప్రాణాధారమైనది.

గోడచాటైనను ఆమె పాడిన పాట అతని అనురాగాంకురమునకు అమృతధార ఐనది. ఆవల ఆమె చేతిగాజులు "ఘల్లు" మన్నవి. ఈవల ఈతని గుండె "ఝల్లు'' మన్నది.

ఇక ''వత్సల వలపు'' గుండెల నెత్తావులు చిత్తగించండి:
''చెప్పెన త్తమ్మ చేతిలో చేయివైచి-నీ కుమారున కిచ్చెద నా కుమార్తె
ననుచు మును నాన్న, నేడు పేరాసఁ దగిలి—తోసిరాజనెఁ జేసిన బాసలన్ని.''

అవును. ఆనాడు వత్సల నాన్నగారు అనుగుచెల్లెలి చేతిలో చేయివేసి చేసిన బాసలన్నీ ఈనాడు త్రోసిరాజన్నాడు. పేరాసతో వత్సలకు వేరొక సంబంధం నిర్ణయించారు. కాని పాపం బాల్యం నుండి బావతో ఏర్పడిన ప్రణయ బంధం ఏంకావాలి? ఆ ఆత్మానుబంధం ఇప్పుడు ఏమైపోవాలి?
''పాలబుగ్గల చిన్నారి ప్రాయమందు-నంతికోద్యానవాటి నవ్యక్తమధుర
మైన యనురాగ మూర నన్యోన్యకంఠ-సీమఁ గీలించితిమి సుమదామములను.''

హృదయాంతరంలో పదిలపరచుకొన్న బావ చక్కదనాలరూపం ప్రక్కకు తొలగించి అక్కడ ముక్కు-మొగం తెలియని మరొక్క కొత్తవిగ్రహాన్ని ప్రతిష్ఠించుకోవటం ఎలా సాధ్యం?
''చిత్రఫలకమ్మునందు నచ్చొత్తినటు-లంటియున్న బావయ్య నెయ్యంపురూపు
చెఱపి ముక్కు మొగమ్ము గుర్తెఱుఁగరాని-వానిఁ జిత్రింపఁ జేతులు వచ్చునెట్లు?''

పెవిధంగా తనకోసం పరితపించే ముద్దుల మరదలి నుద్దేశించి బావ కంఠంలో ప్రతిధ్వనించు ''ప్రణయాహ్వానం'' తీరు పరికించండి:

"మనము చకోరదంపతులమై తెలివెన్నెల తీవెగుంపులో
చని చని తారకాకుసుమసౌరభవాహిని( దోగి, కోసి తె
చ్చిన విరులన్ సరమ్ములు రచించి పరస్పరరాగముద్రగా
ప్రణయిని! రెండుమేనులకు బంధము వైచెద మేగుదెంచెదే"

అంతేకాదు-తన స్వాంత మనే పళ్లెరంలో వలపుల కర్పూరం వెలిగించి-తన ఆరాధ్యదేవతకు హారతీయాలనే ఆకాంక్షతో ఆమె ఆగమనం కోసం అను నిమేషం ఎదురు తెన్నులు కాస్తున్నా నంటాడు.

అది వసంత ఋతువు. వెన్నెలరాత్రి. అందం- ఆనందం చిందిపోతున్న ఆడపిల్లలందరూ తోటలో ఒకచోట కూడి వెన్నెల కుప్పలూ, చెమ్మచెక్కలూ, దాగుడుమూతలూ ఆడుతున్నారు. తాను తెరచాటు నుండి చూస్తున్నాడు. తన చెల్లెలు కూడా వారిలో ఉంది. ఇంతలో-
"కన్నె గేదంగి రేకుల కన్నలైన-నిగ్గు చెక్కిళ్ళ చిఱునవ్వు నృత్యమాడ
నాట వెట్టుచు చెలుల వెన్నాడు కాంత-నా మనోరంగమున ప్రేమనాట్యమాడె"

ఎవరికోసం గుటకలు మింగుతూ ఎదురుచూస్తున్నాడో ఆ ప్రియురాలు "ఆట పెడుతూ" కన్నుల విందుగా కన్పించనే కన్పించింది. ఆమె సాక్షాత్కరించిన ప్రకృతిదేవతలా ఉంది. ఎంతసేపు చూచినా తనివి తీరటంలేదు. ఆమెను కలుసుకోవాలనే కాంక్ష తనలో రేకెత్తించింది. తెర వీడి ముందుకు వచ్చాడు. అక్కడ ఉన్న బావిబొడ్డును ఆనుకొని మళ్ళీ తన ప్రణయ సుందరిని దర్శించాడు. ఒకక్షణం ఆలోచించి బావిలోకి తొంగిచూస్తూ "చెల్లాయ్! అద్భుతం అద్భుతం! వేగంరా! చిత్రం చూద్దువుగాని" అని పెద్దగా అరిచాడు.
"బావిలో తొంగిచూచెడు పగిది నుండి-అందరును వినునట్టు లుచ్చైఃస్వనమున
చెల్లెలా! చూతు రమ్మందు చిత్రమొకటి-అద్భుత మ్మద్భుతమ్మని యఱచినాను."

ఆ చిత్రమేమో చూద్దామనే కుతూహలంతో ఆడపిల్లలంతా ఆటలు మానేసి గబ గబ పరుగెత్తుకువచ్చి బావిచుట్టూ మూగారు. తన ప్రియురాలుమాత్రం మల్లెపాదుదాకావచ్చి మధ్యలోనే సిగ్గుతో ఆగిపోయింది. "చెల్లాయ్! అవిగో చూడు. రంగురంగుల నీటికోళ్లు మూడు బావిలో మునిగితేలుతున్నాయి. అబ్బ! ఎంత బాగున్నాయో! ఇప్పుడే మునిగి అడుక్కిపోయినాయి. పైకి తేల్తాయి. చూస్తూఉండు" అన్నాడు. అంతా తదేకధ్యానంతో రెప్పవేయకుండా బావిలోకి చూస్తున్నాడు.

'మునిగి యడుగున తేగిన పులుగు లిపుడె-తేలి మీ కద్భుతమ్ము సంధించు నిందు చూడుఁడని వారదే దృష్టిఁ జూచుచుండ-సందుఁ గనుఁగొని చల్లగాఁ జారినాను.'' అలా జారుకొని ప్రియురాలిని సమీపించాడు. ఒక మల్లెమొగ్గ కోసి ఆమె జడలో అలంకరించాడు. ఆమె ముసి ముసి నవ్వులు నవ్వింది. ''పలుకే బంగారమా?'' అని ఆ సిగ్గులపెళ్ళికూతురిని పలుకరించాడు. కొంచెం ధైర్యం తెచ్చుకొని ప్రేయసి హస్తము తన వక్షమున గట్టిగా నొక్కిపట్టి-

''వలపు 'కీ' పూర్తిగా నీయబడిన కతన
గుండె గడియార మెటు కొట్టుకొనునొ చూడు'' అన్నాడు. ఆమె కరము కంపించింది. వదనపద్మంలో స్వేదమధువు చిందించింది. కనుగొనలలో చికిలి వాల్చూపులు చిక్కుపడ్డాయి. ఇంతలో అసలురహస్యం తెలుసుకొన్న అమ్మాయి లందరూ వెనక్కుతిరిగి వస్తున్నారు. ''ఉత్తకొంటె చిన్నన్న'' అన్నది చిన్నారి చెల్లి. అంతా చప్పట్లు కొట్టారు. ఆ చప్పట్లచప్పుడుకు అతనికి మెలుకువ వచ్చింది. ఎంత తీయని కల! అందుకనే ఈ ఖండిక నామం 'స్వప్నప్రణయం' అన్నారు.

ప్రణయసూత్రం చాలా చిత్రమైంది. ఎంత చిత్రమైందో అంత సుకుమార మైంది. అది "అణోరణీయాన్.'' అది ''బిసతంతు తనీయసీ.'' అందుకనే తెగిందాకా లాగకూడదంటారు. ప్రియురాలు తన ప్రియుణ్ణి గాలిపటం చేసి ఎగరవేస్తుంది. గిరికీలు కొట్టిస్తుంది. గంతులు వేయిస్తుంది. నభోంగణంలో నాట్యమాడిస్తుంది. ప్రియురాలి చేతిలోని ప్రేమసూత్రం ఎక్కడ తెగిపోతుందో అని ప్రియుడు గిలగిల కొట్టుకుంటాడు.

"కండెఁ జుట్టుచు దారమ్ము క్రమముగా త్వ
దీయసామీప్యమునకు రావించి నన్ను
నీదు హృదయాంతరమున బంధింపు మంచు
వేడుకొనుచుంటలేదు, నీ వ్రేళ్లమధ్య
నలరు దారమ్ముఁ ద్రెంపకు మంతె చాలు"

అని ప్రాధేయపడతాడు.

"నిజముగా నన్ను ప్రేమించు నెలతవేని
క్షణమయిన నిల్వరాదా నా సరస నీవు"

అంటూ ఆ మధుర "క్షణం" కోసం ప్రతిక్షణం ప్రతీక్షిస్తాడు. ప్రణయదేవత సాక్షాత్కారంకోసం నిరంతరం నిరీక్షిస్తాడు.

ప్రేయసీ ప్రియుల ప్రేమకలాపం "దాగిలిమూత" ఆట వంటిది. ఆట ఆరంభమైనది. తల్లియైన ప్రేమదేవత కన్నులు మూసి "పిల్లివచ్చె ఎలుక భద్ర" మని విడిచిపెట్టింది. ప్రియురాలికోసం ప్రియుడు అన్వేషణ సాగించాడు.

ఈ గులాబీపూవుటీరంపు మొత్తమ్ము-లో దుష్టకంటకబాధఁ గొనక
చెరలాడితిని నవాసృగ్బిందు రేఖారు-ణాంశుమాలా శోభియైన మేను
నా మనోరాగ చిహ్నముగా నునుఁబచ్చి-తేనెల క్రొంగ్రొత్త తీపుపసలు
జార్చు మందార ప్రసవగుచ్ఛమధురసౌ-రభములో నీ యనురాగమహిమ
చదువుచును నిన్ను వెదకితి సంతతమ్ము-నాదు వీనుల శబ్దించు నీదు హస్త
కంకణారవమును బాదకంజనూపు-రధ్వనియుఁ దోడుగా నహోరాత్రములును.

ప్రియుడు ఎంత అన్వేషించినా ప్రియురాలి జాడ తెలియలేదు. వెతకి వెతకి వేసారిపోయి-

"ఏ పొదలమధ్య దాఁగినావో ప్రభాత-మందమలయానిలమున నీ మాట లేదు;
చిక్కవే నీవు నా దృఢాశ్లేషమందు-కలసిపోదము తల్లి యుక్కకు ముదమున."

అని అభ్యర్థిస్తాడు. ఆరాటపడతాడు.

ప్రేయసీప్రియులది అవినాభావసంబంధం. అది యుగయుగాల సంబంధం. తరిగిపోని తరతరాల సంబంధం. ప్రణయసింహాసనాసీనురాలైన తన ప్రేయసిముందు తన హృదయ కుసుమాన్ని కానుకగా సమర్పించి ఆత్మార్పణం చేసికొంటాడు ప్రియుడు. తనకూ ఆమెకూ ఉన్న అనుబంధాన్ని వ్యక్తీకరిస్తూ ముక్తకంఠంతో ఇలా అంటాడు-

"త్రిభువనమ్ములలో రసోద్దీపనమ్ము-వెల్లివిరియించు ప్రణయరూపిణివి నీవు;
నీ దరస్మితరోచిః ప్రసాదకాంక్ష-కొనలు సాగిన ముగ్ధభిక్షుకుఁడ నేను."

"స్వర్గధామమ్మునందు విస్ఫారదివ్య-శోభ లదరించు నిర్మలజ్యోతి నీవు;
విమలసుస్నేహపూర నివేదనమ్ము-లొదవ నిను బూననెంచు ప్రమ్మిదను నేను."

"సందువోయిన నా పూర్వజన్మతపము-పట్టుపఱుపఁగలేని యుపాసనాధి
దైవతమ వీవు; నీదు ప్రత్యక్షమునకు-గడియ లెంచుచునుండు భక్తుడను నేను."

"జన్మజన్మాంతరముల నా స్వాంతవీథి- నీ సుధాస్వాదులజ్జావిలాసరేఖ
పఱపి కికురించిపోయిన మెఱపు వీవు;- నేను నీ మార్గములు చూచు నీరదుండను."

అవును. ఆమె ప్రణయస్వరూపిణి; అతడు ప్రేమభిక్షుకుడు. ఆమె నిర్మలజ్యోతి; అతడు స్నేహముతో నిండిన ప్రమిద. ఆమె ఉపాసనాదైవము; అతడు భక్తుడు. ఆమె మెరపుతీవె; అతడు మెరపుకై ఎదురుచూచు మేఘము. ఆమెలేనిదే అతనికి అస్తిత్వమే లేదు. కనుకనే-

"నీవు జీవనదాత్రివి నేను జీవి
నీవు లేకున్న నా లేమియే ధ్రువమ్ము."

అంటాడు.

ఈ సంసారసాగరంలో మానవ జీవితం ఒక నావ వంటిది. అది ప్రయాణం సాగిస్తుంది. తరంగాల తాకిడికి ఓర్చుకొని ఆటంకాలూ, ఆఘాతాలూ తప్పు కొంటూ ముందుకు సాగిపోతుంది. అయితే ఆ నావ తన గమ్యస్థానం చేరుకుంటుందనే నమ్మకమేముంది? ఒకవేళ ఏ తుఫానో సంభవించి ఆ పడవ మధ్యలోనే పగిలిపోతే ఆ జీవితం అంతటితో భగ్నమై ముగిసిపోవలసినదేనా? పవిత్రమైన ప్రణయంలో అటువంటి భయానికి చోటులేదు. నట్టనడి సంద్రాన ఏ గట్టుకో చెట్టుకో కొట్టుకొని బ్రతుకు పడవ పగిలిపోయినా ప్రణయం మాత్రం భగ్నంకాదు. ఈ పరమసత్యం "పడవ పగిలిన" అనే ఖండికలో ఈ విధంగా ప్రకటింపబడింది. ప్రియురాలి నుద్దేశించి ప్రియుడిలా అంటాడు-

ఇది పగిలిపోవునను భయ మ్మింతవరకు
ఈ తలంపున ఆనంద మిపుడు పొంగు;
పగిలిపోయిన చెక్కల పట్టువిడువ
కీవు పాథోవిధానమ్ము నీదె దవని!

ఇది పగిలిపోవునను భయ మ్మింతవరకు
ఈ తలంపున నిపు డుల్ల మిగురులెత్తు;
తునిగిపోయిన చెక్కలతో పయోధి
గర్భమున రత్నరథ మీవు కట్టెదవని!

ఇది పగిలిపోవునను భయ మ్మింతవరకు
ఈ తలంపున నిపు డాత్మకింత శాంతి;

విఱిగిపోయిన చెక్కలదరికి జేర్చి
నీ చితికి కాష్ఠములుగ మన్నించెద వని!

ఆత నిజీవి మంతా ఆమెకే అంకితం. ఆమె అనురాగమూ, అభిమానమూ, అనుబంధమూ తప్ప అతనికి మరే కోర్కెలూ ఉండవు. అతడు ఏ కొంచెమైనా ఆశిస్తే ఆ "ఈప్సితలేశం" ఈ విధంగా ఉంటుంది :

అది నడచువేళ నేలఁ జీరాడు కుచ్చె
రేపు దుమ్మున నొక త్రసరేణువు నయి
దాని తనువుకఁ బుట్టు స్వేదమునఁ గలసి
కరగిపోదును రూప మేర్పడుపరాఁక.

అది యుషస్స్నాన మొనరించి యంతఁ గట్టు
కొనిన పచ్చని పట్టుదుకూల మందు
నార్ద్రమగు లేజరీయంచునై తదీయ
దేహమున గగుర్పాటులు దిద్దుకొందు.

అది శుచిర్భూతయై దేవతాళి పూజ
లైన వెనువెంట తన పూతహస్తమంటి
హారతికి వెలిగించు కర్పూరమునయి
వాసనలు చిమ్ముదును దాని వదనమందు.

అంతేకాదు- "ప్రణయినీ వదనాంచలభాగమందు ఒక్క చిఱునవ్వు తరగనై యూగుచుందు" నని, "ప్రణయినీ శీతల దృగంత పాతమందు కరడు గట్టిన యొక సుధాకణము నగుదు" ననీ ఉత్కంఠితుడౌతాడు.

ప్రియురాలే కాదు; ఆ తన్వంగి వంగి తొంగి చూచే కిటికీ సైతం ప్రియునకు ఎంతో ప్రియంగా కన్పిస్తుంది. తనకు ప్రతిక్షణమూ "ప్రణయినీ ముగ్ధ రూపలావణ్యరేఖ"ను దర్శన మిప్పించే ఆ గవాక్షానిది ఎంతటి దాక్షిణ్యమయ హృదయమో! ఆ వాల్గంటి ఇంటి కిటికీ తన యెడల చూపించే అవ్యాజ కారుణ్యానికి పొంగి పులకించి పోతాడు ఆ అమాయిక నాయకుడు.

ఉదయకాల సాయంకాలాల నీడల సంకోచ వ్యాకోచాలను కుజన సజ్జన మైత్రితో పోల్చి కవిత చెప్పాడు ఏనాడో భర్తృహరి-

మొదల చూచిన కను గొప్ప, పిదప కుఱుచ,
ఆది కొంచెము, తర్వాత నధికమగుచు,
దనరు దినపూర్వ పరభాగజనితమైన
ఛాయపోలిక కుజన సజ్జనుల మైత్రి.

ప్రియురాలి నీడలో మేడ కట్టుకొన్న నాయనివారు మరొక్క అడుగు ముందుకు పోయి ఉదయవేళ మెల్లమెల్లగా సంకోచాన్ని పొందే నీ నీడకొనల వెంబడి అరుదెంచి నీ పాదాలను చేరుకుంటా నంటాడు. మధ్యాహ్నవేళ మండు టెండలో అలసిపోయిన నీ నీడలో కలసిపోయి నీ శరీరం అంచుల్లో కొంచెం విశ్రాంతి తీసికుంటా నంటాడు. సాయంవేళ రాగరంజితమై దూరదూరాలకు సాగిపోయే నీ నీడతోపాటు కదలిపోయి అనంత దిగంతాలను ఆవరిస్తానంటాడు. ఎంతటి ఉదాత్తభావమో చిత్తగించండి :

"ఉదయ సంధ్యానవాంశువు లదుమ దద్దరిల్లి ఆశాంతముల నుండి మెల్ల మెల్ల కుంచుకొనిపోవు నీ నీడకొనల వెంట-చేరుకొందును నీ పదాంభోరుహములు"

"ప్రబలమధ్యాహ్న తీక్ష్ణాతపమున కలఁగి-అలసిపోయిన నీ నీడఁ గలసిపోయి ప్రణయ భావాతి మధుర విశ్రాంతి కొఱకు-నీ శరీరాంచలములంటి నిలిచియుందు."

"అపర సంధ్యార్ద్రరోచుల నమృతరాగ-మంజురంజితమై సాగి మఱల దెసలు క్రమ్ముకొనిపోవు నీ నీడఁ గలసి వెడలి-ఆ యనంత దిగంతమ్ము లావరింతు."

ప్రియునకు ప్రియురాలి విశ్వరూపము సాక్షాత్కరించినది. అది హృద యాంతరములో అంతకంతకు పెరిగి పెద్దదై పోయినది. ప్రథమ సందర్శనం లోనే తన కనుపాపలందు ప్రవేశించిన ప్రణయినీ ప్రణయమూర్తిని సురిగిపో కుండ రెప్పలు కప్పి అదిమి పట్టినాడు. కాని ఆ మూర్తి క్రమముగా హృదయ మంతటా నిండి పోయింది.

అంత భరియింపలేక నా యక్షియుగ్మ-మల్ల తెఱచితినో లేదొ యంతరమున
ప్రతిమ బ్రహ్మాండగోళమ్ము పట్టలేదు-నేను నిలువను తావు సుంతైన లేక.

కనుకనే ఈ ప్రణయము అననుభూతపూర్వమనీ, నిత్యనూతనమనీ, సత్యసనాతనమనీ చాటి చెబుతాడు.

ఆనాడు శుక్రవారం. వత్సల జగజ్జనని చరణసన్నిధిలో మోకరిల్లి పూజా పుష్పమైనది. సౌభద్రుడు సైతం భక్తి పారవశ్యంతో పొంగి పులకించి తానూ ఒక ఆరాధనా పుష్పంగా మారిపోయినాడు. ఆ జంటపూవుల సౌరభంతో రోదసి నిండిపోయింది.

''ఆ త్రిలోకైకజనని పాదాబ్జసవిధ
భూమి మీలితనేత్రవై మోకరిల్లి
నీవు పూజాసుమమ్మ వై నావు; హృదయ
కర్ణికామూలమున భక్తి కందళించి
అదరు పారవశ్యమ్మునఁ దొడిమ యూడి
నేను పూవునై పడితిని నీదు చెంత
జంట పూవుల అమృతనిశ్వాససౌర
భమున రోదసి శుక్రవారము నదించె.

ఈ విధంగా సౌభద్రుని ప్రణయ యాత్ర సహృదయ హృదయంగమంగా సాగింది. సౌభద్రుని జీవితనావ గమ్యాన్ని చేరుకొంది. వత్సలా సౌభద్రుల ప్రేమలత అంకురితమై పల్లవితమై కోరకితమై పుష్పితమై క్రమంగా ఫలోన్ముఖమైంది. ఇక ''ఫలశ్రుతి'' పఠించి ఆనందించుదాం.

**ఫలశ్రుతి :**

ఆనాడు భగీరథుడు దివి నున్న గంగను భువికి తెచ్చినట్లు, దేవతలు పాలసముద్రమును మథించి అమృతభాండమును సంపాదించినట్లు నా పురాకృత పుణ్యాలు ఫలించి జాహ్నవీస్వచ్ఛవూ, సుధామధుర మూర్తివీ అయిన నీ సాన్నిధ్యం అందుకోగలిగాను, అని తన సంతుష్టిని ప్రకటించుకొంటాడు ఇందులో నాయకుడు.

అంత శ్రమపడి పావన మభ్రగంగ-ధారుణికి దెచ్చినాడు భగీరథుండు
అంత మథియించి కలశరత్నాకరమ్ము అమృతభాండమ్ము పడసినా రమరవరులు
మత్పురానేక పుణ్యజన్మములు పండి-జాహ్నవీ స్వచ్ఛవును సుధాస్వాదుమూర్తి
వైన నీ దివ్యసాన్నిధ్య మందుకొంటి-పుడమికిని స్వర్గమునకొక్క-ముడి రచించి,

వత్సలాఫాలమున నెలవంక గుఱుతు-కందళించి వికాసించి కళలు దేరి
తరుణ శారద రాకాసుధాకరాచ్ఛ-బింబము లనంతములు లెక్క పెట్టుకొనెదు.

నెలవంక కందళించి, వికసించి, కళలు వెలయించి రాకా సుధాకర బింబాలను అనంతంగా సృష్టించిందనడం నాయికానాయకుల ప్రణయ పరిపూర్ణ స్వరూపాన్ని సూచిస్తుంది. ప్రేయసీ ప్రియులు దంపతులైనారు.

''నన్ను నీ చెంత చేర్చుకొన్నావు దేవి!'' అని సౌభద్రుడు వత్సలతో అంటాడు. ''ఈ యమృత రాజ్యమున మన మిద్దఱమును; నీవు రాజ్ఞివి నేను నీ సేవకుడను'' అని తన సౌహార్దసౌజన్యాలను ప్రకటిస్తాడు. ''బావ యను మాట ప్రేమప్రపంచమునకు నీవు పెట్టిన పేరు'' అని తన సంతృప్తిని వెల్లడిస్తాడు.

"నా సరస్వతి నీవు నా చదువు నీవు-నా విపంచిక నీవు నా నవ్యమధుర
గీతినీవు నా హృదయమ్ము రీతి నీవు'' అని తన ప్రణయాన్ని ప్రస్తరించి విస్తరించి ప్రియురాలి ముందు పరుస్తాడు.

"నా ప్రయాణమ్ము నీవు నా పథము నీవు-నా విడిది నీవు నా చేరు నగరు నీవు
నా పరము నీవు నా పరాత్పరము నీవు'' అని ఆమెకు నమస్సుమాలు అర్పిస్తాడు.

"నీ తొడ తలాడగా శయనింపగలిగి-దేవి! నా జన్మమున్ సమర్థించినాను;
ముక్తిసీమంతినీ త్రపాముగ్ధ వరద-హస్తవలయితుడౌ పరమాత్ముబోలి''
అని తమ దాంపత్యాన్ని దివ్యంగా భవ్యంగా చిత్రిస్తాడు.

''పరమపదనాథు కౌఁగిఁట పార్వతియుఁ బోలె
నా కౌఁగిట మౌనముద్ర నున్నావు నీవు"
అని తమ ప్రణయాన్ని ఆది దంపతుల ప్రణయంతో ధ్వనింపచేస్తాడు.

"మనము ప్రణయ మహాకావ్యమున నపూర్వ
నాయికానాయకుల, మభిన్నములైన
మన మనోభావగీతమ్ములను పఠించి
పరవశముపో రసజ్ఞ ప్రపంచమెల్ల".

అని తమది ఆదర్శ దాంపత్యమనీ, ఈ ధార్మిక ప్రణయకావ్యానికి తాము నాయికా నాయకులనీ, తమ భావగీతాలు పఠించి భావుక ప్రపంచం పరవశించి పోతుందనీ అచంచలమైన ఆత్మవిశ్వాసంతో మురిసిపోతాడు.

ఫలశ్రుతిలో ముప్పది ఖండికలున్నాయి. భావకవిత్వానికి ధార్మిక ప్రణయానికి విజయకేతనాలైన "సౌభద్రుని ప్రణయ యాత్ర", "ఫలశ్రుతి" శాశ్వతంగా నిలుస్తాయి.

**మాతృగీతాలు :**

శృంగారం సుకుమారమైతే కరుణం పరమ సుకుమారం. ఇష్ట జన వియోగజన్యమైన శోకం కరుణరసానికి స్థాయిభావం. నాయనివారి ప్రణయ యాత్ర ఆనందమయంగా ముగిసిందే కాని అనంతర జీవితంలో ఆయనకు మాతృ వియోగం ఎంతో దుఃఖాన్ని తెచ్చిపెట్టింది. తన్ను కని పెంచి పెద్దచేసిన కన్నతల్లి వియోగాన్ని ఆయన సహింపలేకపోయినాడు. వారి అంతరంగంలో పొంగిపొరలి ప్రవహించిన శోకతరంగాలే వారి మాతృగీతాలు. తన్ను వదలి ఒక్క-క్షణకాలం కూడా నిలువలేని తల్లి తన్ను శాశ్వతంగా విడిచిపోయింది. మాతృమరణం ఆయనకు అశనిపాతం అయింది. ఆ చల్లనితల్లి మళ్లీ తిరిగిరాని లోకానికి వెళ్లిపోయింది. ఎప్పుడూ వెళ్లేటప్పుడు తనను వెంట తీసుకువెళ్లేది. ఇప్పుడు చెప్పకుండా వెళ్లిపోయింది. జననీశోక విహ్వలమైన కుమారుని కంఠంలో విషాద వీణ మ్రోగింది. "అపిగ్రావా రోదిత్యపి దళతి వజ్రస్య హృదయం" అన్న భవభూతి మహాకవి సూక్తి గుర్తుకు వస్తుంది-

నీవు మడిగట్టుకొని పోయినావు పండ్లు,
పుష్పములు తీసికొని దేవపూజ కెటకొ
నేను నీ కొంగు పట్టుక నీదువెంట
పోవుటకు లేక కన్నీటిబొట్లు రాల్తు

అపకర్మ చేయించే పురోహిత బ్రాహ్మణుడు వైతరిణీ నదిని తరింపజేయటానికి గోదాన మిమ్మన్నాడు. ఎంత అవివేకం! ఈ సందర్భంలో నాయని అంటారు-

నీవు గమియింప వైతరణీ ప్రవాహ
మావు నొక దాన మిమ్మనె నవనిసురుడు

నాకు తెలియును నీ స్పర్శ సోక నందు
అమర శైవాలినీ సహస్రములు పుట్టు.

అవును. అమ్మ స్పర్శ తగలంగానే జ్వాలనజ్వాలలతో భగభగ మండే వైతరిణీ ప్రవాహాలు అమరగంగా ప్రవాహాలుగా మారిపోతాయి. ఆ తల్లి చలువ అలాంటిది.

ఇంక నా జీవితమ్ము నీ స్మృతికి చెక్క-
బడిన యొక శాసనమ్మయి వరలు నటవె
చిన్ని నీ విగ్రహము ప్రతిష్ఠితము నాదు
నంతరంగమ్ము నీకు దేవాలయమ్ము.

వాస్తవమే. మాతృదేవతకు తన అంతరంగమే ఆలయం. ఆమె దివ్య స్మృతికి ఆయన జీవితమే ఒక శిలాశాసనం.

తల్లి లేని తనయుణ్ణి అంతా చులకనగా చూస్తారు. పాపం! తాను స్నానం చేద్దామని దిగుడుబావికి వెళ్లాడు. అచ్చటి ఒడ్డును తాకుతున్న అలలు "మీ అమ్మ ఏదీ?" అని అడిగినాయట. ఎంతటి రసార్ద్రమైన భావం!

ఏను స్నానమ్మునకు బావి కేగినాను
లేత సూర్యుని బంగరు పూతలందు
మురియుచును తల్లి యొడ్డును ముద్దుగొనుచు
'అమ్మ యేదిరా' యన్నవా యలలు నన్ను.

అలలే కాదు- పైన తేలుతున్న తాబేలుకూడా ఆయన్ని చూచి అవహేళనగా మునిగిపోయిందిట.

పైని వేంచేసి యూపిరి పట్టుకొనుచు
చిన్ని తాబేలు నన్ను వీక్షించి జలము
త్రవ్వుకొను చేగె కూపగర్భమున దాగ
పై నలముకొన్న సుళ్లు నా పాల విసరి

తాబేలు మునిగినప్పుడు నీళ్లలో గుండ్రని సుళ్లు బయలుదేరాయి. ఆ సుళ్లు సున్నాలు చుట్టినట్లున్నాయి. అంటే "మీ అమ్మ నీకు సున్నా" అన్నట్లుగా ఉందట. రసధ్వని ప్రతిధ్వనించింది.

'నీకు లేదమ్మ' యన్నది నీటి పాము
పైకెగసి యొక్క కప్పను పట్టుకొనుచు-

కప్పను కబళిస్తున్న పాము కఠోర మృత్యువునకు ప్రతీక. "మీ అమ్మను ఇదే విధంగా మృత్యువు మింగేసింది. ఇక నీకు అమ్మలేదు పో" అన్నట్లనిపించింది.

శివరాత్రి వచ్చింది. కడచిన ఏడాదివలె అమ్మ "సువర్ణముఖి"లో స్నానం చేసి కాళహస్తీశ్వరుడి గుడిలోకి తీసుకు వెళ్లటానికి రానేలేదు. నూతన సంవత్సరాది వచ్చింది. అమ్మ తన శిరోజాలు చిక్కుతీసి తనకు తలంటి పోయటానికి రానేలేదు. ఆ రోజు బ్రాహ్మణుడు తెచ్చియిచ్చిన వేపపూత పచ్చడి అచ్చంగా చేదుముద్ద అయింది.

మాతృగీతాల్లోని ప్రతి గీతంలోను నాయనివారి అశ్రు బిందువులు చిందిపోతుంటాయి. ఇది అరవైమూడు గీతాలుగల విషాదకావ్యం. ఇది కవిగారి కన్నతల్లియైన "ఉదయమ్మ తల్లి"కి అంకితం.

## విషాదమోహనము

ఇది రెండువందల ఇరవైఅయిదు మధ్యాక్కరలతో కూర్చిన విషాద కావ్యం. మాతృవియోగాన్ని మరచిపోయి కొంత విశ్రాంతిగా జీవితం గడుపుతున్న నాయనివారికి ఏకైక పుత్రుడైన మోహనకృష్ణుని మరణం గోరుచుట్టుపై రోకలిపోటు అయింది. ఆయన హృదయ వేదనయే విషాద మోహనంగా ఆవిర్భవించింది.

జీవన్మరణ సంధిఁ గొట్టుకొనుచున్న చిన్నారి సుతుని
ప్రోవు మంబా! యంచు శోకబాష్పావరుద్ధకంఠమున
శ్రావణ శుక్రవారమున వరలక్ష్మి సన్నిధి వగపు
క్రోవి వత్సల కొట్టినట్టి టెంకాయ క్రుళ్ళిపోయినది!

ఎంతటి అపశకునం! రాబోయే అమంగళం ముందుగానే కన్పించింది. ఇక అన్నంముందు కూర్చున్నప్పుడు ఆయన అవస్థ అతి దీనంగా ఉంది- అవలోకించండి-

అన్నమ్మ ముందట కూరుచుండి "మోహనుడు రాడేమి
అన్నాని" కని యలవాటు చొప్పున ననబోయి యంత
పున్నెమ్మునకు నోచుకొనని దురదృష్ట భూతాహతుండ
నన్నమ్మ మ్రింగుడు పడక నిన్నెంచి యశ్రువుల్ రాల్తు!

వార్ధక్యంలో ఏకైక పుత్రశోకవిహ్వలులైన దంపతుల దయనీయదశ హృదయ విదారకంగా ఉన్నది. చూడండి-

ఒకరి నొక్కరు చూచుకొనుచు సంతాపయుత వీక్షణముల
ఒకరి నొక్కరు పిల్చి పల్కరించుకో నుద్యుక్తులగుచు
ఒకరిమే నొకరు నిమురుచు దురదృష్ట మోతుహ స్తముల
ఒకరి బాష్పమ్ముల నొకరు తుడుచుచు నూఱడిల్లెదము!

కరుణం పరాకాష్ఠ చెందింది. కలం కదలలేనంటున్నది. కన్నతండ్రి చిన్ని కుమారుణ్ణి ప్రశ్నిస్తున్నాడు-

బోయిన సూర్యుండు వచ్చు! పోయిన చంద్రుండు వచ్చు!
పోయిన పదునాఱు కళలు పూర్తిగా విదునకు వచ్చు!
పోయిన తారకల్ మినుకు పూవుల గుత్తులు వచ్చు!
పోయిన మోహనా! వినయభూషణా! తిరిగిరావేమి?

మోహనా! అందరూ పోయినవాళ్ళు తిరిగి వస్తూనే ఉన్నారు, సూర్యుడూ, చంద్రుడూ, నక్షత్రాలూ. కానీ నీవుమాత్రం తిరిగిరావడంలేదు!

"ప్రాసాదేసా పధిపధిచసా పృష్ఠతస్సా పురస్సా"

అన్నట్లు ఆయనకు అంతటా కుమారుడే కన్పిస్తున్నాడు. సృష్టి సమస్తం మోహనమయమైపోయింది-

నిదురలోపల నీవు! స్వప్నవీథిలో నీవు! కన్విప్ప
నెదురుగా చిరునవ్వు లొలుకబోయుచు నీవు! కన్మాయ
కుదురుగా మన్మనస్సింహపీఠిపై కొలువుండి నీవు!
మదఖిలదైనిక కార్యజాతంపు మలుపుల నీవు!
చదువుకో తెరచు పొత్తమ్ము పొరటల సందుల నీవు!
చెదరిన దృష్టిలో నస్ఫుటమ్ముగా చిక్కు తీరులుగ

పదిలమ్ము కొరవడ్డ ముద్రితాక్షర పంక్తుల నీవు
మది నంకురించెడు భావములు విప్పు మడతల నీవు!

భావాలు విప్పే మడతల్లోనే కాదు- గుండెలోతుల్లోనుంచి ఉబికివచ్చే పద్యాల బరువుల్లోనూ నీవే ప్రత్యక్షమౌతున్నావని వాపోతోంది ప్రేమమయమైన పితృ హృదయం. గుండెలు కుదిలించే ఎన్నో సన్నివేశాలనూ సంఘటనలనూ తలచుకొని మధురభాషణుడూ వినయ భూషణుడూ అయిన తన తనయునికోసం తల్లడిల్లి పోతారు నాయనివారు. ఇందలి ప్రతి పద్యంలోనూ ఆయన తన దైన్యాన్నీ ఆవేదననూ కన్నీళ్ళనూ మూటగట్టి లోకాని కందించారు. జాలి జాలిగా స్పందిస్తూ కన్నీరు చిందిస్తూ కలకాలం నిలిచే కరుణకావ్యం నాయనివారి "విషాదమోహనం". బిడ్డలను పోగొట్టుకున్న తల్లిదండ్రులకూ కరుణకావ్యాలు రచించిన కవులకూ ఈ కావ్యం అంకితం చేశారు కవిగారు.

## వేదనావాసుదేవము

మడి గట్టుకొని పూజాపాత్ర పట్టుకొని దేవుడి సన్నిధికి పోతూ కన్నతల్లి తన్ను వెంట పెట్టుకొని పోలేదు. అలనాడు పోయిన మోహనుడు తిరిగి రాలేదు. ఇలువేలుపైన ఏడుకొండలవాడు కూడా కొంచెమైనా కనికరింపలేదు. విశ్వమంతా వేదనామయంగా కన్పిస్తున్నది. సంసార సముద్రాన్ని ఈదలేక ఊపిరాడక గిలగిల కొట్టుకుంటున్నది జగత్తు. జగత్తులోని ప్రతి మానవుడి వేదనను తన వేదనగా చేసుకొన్న నాయనివారు తన ఆవేదనను దేవదేవుడైన వాసుదేవుడికి నివేదించుకొన్నారు. అదే వేదనావాసుదేవము. నాయనివారి దృష్టిలో వాసుదేవుడే వేంకటేశుడు. ఈ కావ్యంలో నూట ఎనిమిది పద్యాలున్నాయి. కొంత స్తుతి, కొంత వ్యాజస్తుతి, కొంత భక్తి. మరికొంత విరక్తి ఇందులో చోటుచేసుకున్నాయి.

ఆ మహాతల్లి చలువ, గోటానుకోట్ల- కీవు పడగలెత్తితి కొండెక్కి- కులుక
అలి చేసిన సంపన్మహానుభావ!-వట్టి పిసినారివగుట భావ్యమ్మటయ్య!

తనయందు కొంచెమైనా కనికరం చూపని ఏడుకొండల స్వామిని పై విధంగా ఉల్లసమాడారు. దుష్టులకు వరాలిచ్చే శివుడూ, శిష్టులను బాధలుపెట్టే కేశవుడూ- వీరిద్దరూ ఇద్దరేనంటారు.

ఆ జగల్లయకారి సాంబయ్య భ్రష్ట-చిత్తులకు ప్రసన్నతండమ్ము లెత్తువాడు!

భక్తులను బిట్టుజూచి అంపాన బెట్టి-కాని వదలని గడుసు వెంకయ్య నీవు! మాన్యులైన మీరిద్దరూ సామాన్యులైన మానవులను మాయ చేస్తున్నారు. ఏమంటే

ఆయన నినుఁ జూపించును-ఆయనఁ జూపింతు నీవు, హరిహరబలవ
న్మాయా వాగుర నెఱకలు-వోయిన పక్షినయి దొద్దవోవుదు నేనున్

తోడు దొంగలైన మిమ్మల్నిద్దరినీ మెలవేసి పట్టుకొని కొందరు హరిహరాద్వైత మనే కళ్లంలో కలిపికొట్టారు, మరి వారికేమైనా వరాలు రాలాయా లేదో! ఇక్కడ ఖలాంతరంలో కలిపికొట్టడమన్నది చమత్కారం.

ఇరువురును తోడుదొంగలే పరమగురులు!
హరిహరాద్వైతభావ ఖలాంతరమున
కలిపికొట్టిరి కొందఱు ఘనులు మిమ్ము,
రాలెనేమొ వారికిని వరాలమూట!

నేను విరక్తితో నిన్ను బయటకు నెట్టి తలుపులువేసి గడియ బిగించాను. కాని కుంచెకోల నీ చేతిలో ఉన్నదన్నమాట మరచిపోయాను. నీవు మళ్ళీ గడియ తీసుకొని నా లోపల ప్రవేశించగలవు.

ఒక నిర్వేదపు వెల్లువన్ మునిగి నిన్నుద్వాసితుం జేసి భ
ల్లుకపుం బట్టుగ నాదు గుండె గుడితల్పున్ మూసి లోనన్ బిగిం
చుకొనంగా గడె, యేమి నా తెలివి మందున్, తల్పుపైనుండి పా
యక తీయంగల కుంచెకోల యది నీ హస్తార్పితమ్మై ప్రభూ!

నా వెనుక చేరి గంతులు వేయకపోతే ముందుకువచ్చి దారి చూపరాదూ! లేకపోతే నా చేతిలోని అక్షయపాత్ర కొంచెంసేపు నీవు పటుకోరాదూ! భిక్షాటనం చేయటంనీకేం కొత్తకాదు కదా! (ఈ పద్యంలో వామనావతారగాధ స్ఫురింప జేసారు).

వెనుకం జేరియు తందనాల్ పలుకుటే వేడ్కైనచో నెట్లు ,ముం
దనుసంధించియు దారి చూపు మది కాదా మోయగా భారమై
చను నీ యక్షయపాత్ర నీవును ధరించన్ వచ్చుగా కొంత సే
పని దంపూర్వ్యద వేమి కాదుగద! నీ యాధిక్యముం జాటుకోన్.

"ఆటలో నేను అలసిపోయాను. ఎల్లదాటి నిన్ను కొట్టలేకపోతున్నాను. ఏదీ ఈ సారి నీవు కూతకు రా పట్టుకోగలనేమో చూస్తాను" అంటున్నారు-

కూతన్ బెట్టుచు నెల్ల దాటియు నినున్ కొట్టంగ నీ యుద్ధతిన్
చేత మ్మక్కిరిబిక్కిరై మఱలుదున్ చింతాహతాశుండనై
నా తండ్రీ! యొకసారి కూత యిడుచున్ నావంక కేతెమ్ము సం
భూతప్రజ్ఞత నిన్ను పట్టగలనేమో కొంత యత్నించెదన్.

అలసిపోయి తన అపజయాన్ని అంగీకరిస్తున్నాడు-

తెలియగరాని యుద్దివిగదే జగదీశ్వర! అంతులేని యీ
బలిగుడు కూతలోన కడబట్టుచు నున్నవి ప్రాణముల్-

నిజమే భగవంతుడితో బలిగుడు ఆట ఆడటం ఎంత కష్టం!

ఈ క్రింది పద్యంలో తన తండ్రిగారి అచంచల భక్తిని వ్యక్తీకరించి ఆ భక్తియే ఆయన కుమారుడైన తనకు సంక్రమించిందని, దాని బలంతోనే నిన్ను వశపఱచుకొంటానని ఉగ్గడిస్తున్నాడు.

నా జనకుండు సర్వసుజన స్తవనీయపవిత్రవర్తన
శ్రీ జయధాము డెల్లపుడు చిత్తమునన్ భవదీయమూర్తి సం
యోజనమై తరించిన మహోదయు, డాయనభక్తి యెల్ల ని
ర్వ్యాజత నన్ను పట్టినదిరా! నిను పట్టెదరా! యెటైననున్.

ఈ క్రింది పద్యంలో మహిళామతల్లి అయిన తన తల్లి నిత్య సత్య వ్రతాన్ని నిరూపించి ఆమె సంతానమైన తనను పూజాపుష్పంగా స్వీకరించ మంటున్నాడు.

నా జనయిత్రి దీనజననందిని భాస్కరమండలాంతర
భ్రాజితు నిన్ను గన్గొనక పారణసేయని నిత్యభక్తి దీ
క్షాజయలక్ష్మి తద్విమలగర్భమునన్ చిరపుణ్యపాకమై
యీ జని విచ్చె భవ్యభవదీయపదార్చన కొక్కపూవుగాన్!

నీవెంత కమలాధీసుడవైనా ఈ గడ్డిపూవుపై చిన్నచూపు తగదని విన్న వించుకొంటాడు. దీనికి తగిన సుగంధం దీనికున్నదిలే అంటాడు.

పదములు నాభియున్ కనులు బాహుముఖమ్ములు దివ్యపద్మముల్
మది కమలాక్ష మీ పనికిమాలిన చిల్లర గడ్డిపూవు నా
యెద కిదియేమి యించునని యెంచక నన్ను కృతార్థు జేయవే!
యిది తమమేన క్రొవ్వలపు లీనునులే! ఒక విష్ణుక్రాంతమై.

పై పద్యంలో ఆ గడ్డిపూవును విష్ణుక్రాంతమనటంలో చక్కని శ్లేష ఉన్నది.

భావమచ్చపు కోడెత్రాచుగతి జిహ్వల్ కోయుచున్ వక్రమా
ర్గావష్టంభత కాలకూటవ మధు వ్యాపారమై లేచు "పా
న్పై" వర్తిల్లునొ నీకు "దండకడెమై" భాసిల్లునో అంతయున్
నీ వైదగ్ధ్యము కాదటే హరిహరోన్నిద్రప్రభావాకృతీ!

నా మనస్సు కోడెత్రాచులాగా బుసలు కొడుతుంది. నీవు దీనిని తల్పంగా వరిస్తావో, దండకడియంలా ధరిస్తావో అని భగవంతుడి హరిహరత్వాన్ని స్ఫురింపజేసి తరింపచూస్తాడు.

నా పత్నీరమణీ సుధాప్రణయితానందమ్ములం దేలితిన్
నా పుత్రీవిదుషీయశో విసర విన్యాసమ్ములం బొంగితిన్
నా పుట్టిల్లను పండె నీదు చలువన్ మానాథ! సంసారసౌ
ఖ్యాపూర్ణమ్ముగ నేమి కావలయునయ్యా యింక నా కిచ్చటన్!

అవును. అనురాగమూర్తియైన అర్ధాంగి అమృత మయమైన ఆనందాన్ని అందించింది. విదుషీమణులైన పుత్రికల పేరు ప్రఖ్యాతులు అనంతమైన సంతోషాన్ని సంతరించాయి. ఆయన జన్మ సార్థకమైంది.

శ్రుతిసీమంతిని చెందిరంపు తళుకుల్ శుద్ధాంతరంగమ్ములన్
జతనమ్మై వికసించు శాంతకలికల్ సాహిత్యసౌహిత్యసం
భృతమార్గమ్ములు తేజుకొల్పు పలుకుల్ విశ్వామయస్వాస్థ్య మం
చిత యోగమ్ముగ సంతరించు గుళికల్ నీ వేదనావాసనల్.

పైపద్యంలో వాసుదేవుని వాసనావిలాసాలను అనన్య సామాన్యంగా అభివర్ణించి ధన్యోస్మి అనుకున్నాడు కవి.

ఈ విధంగా శయ్యలో, చమత్కారంలో, భక్తిలో, పరిహాసంలో వేదనా వాసుదేవంలోని పద్యాలు హృద్యాలై అనవద్యాలై సహృదయ సంవేద్యాలై అలరారుతున్నాయి. ఈ కావ్యం ఇష్టదైవమైన వేంకటేశ్వరుడికే సమర్పింపబడింది.

సౌందర్యలహరి

పదునాలుగు పద్యరత్నాలతో ప్రకాశించే భక్తిరసప్రధానమైన కావ్య ఖండిక యిది. దేవీస్తుతి రూపమైన ఈ చిన్నికృతికి ఆచార్య శంకరులపీఠ

అభిమానంకొద్దీ 'సౌందర్యలహరి' అనే పేరు పెట్టారు నాయనివారు. ముచ్చటగా మూడు పద్యాలు మచ్చుకు ఉదాహరిస్తున్నాను-

ఈ వనరాశి మధ్యమున నీ గతి నన్నెదురీద బంచి దుః
ఖానిలమైన నా బ్రదు కనంతముఖమ్ముల గ్రుంగిపోవ నీ
వావలి తీరసైకత విహారపథమ్ముల నాత్రరక్షణ
శ్రీ వెలయన్ చరించు చిటు చిర్నగవుల్ పచరింతు వంబికా!

ఆ దరహాసచంద్రికల కర్థము సుంత యెరుంగరాక శం
కాదళితమ్ము నా హృదయకంజము దుస్తర మీపయోధి యం
దీదగజాల కంగకము లెత్తుపడున్ జగదేకరాజ్ఞి! నీ
యాదరణంపు నౌక నిటులంపుము నన్ను సముద్ధరింపగన్.

అది మొదలంట సర్వమును నప్పుడు శూన్యమ యంట యెందుకో
పెదవి గదిల్చి నీవు నౌక వింతగ నవ్వితివంట తల్లిః నీ
మృదుహసితమ్ములో పరిమళించినదంట సమస్తవిశ్వమున్
సదమల తావకీన కరుణారసపాన వివర్ధమానమై.

## భాగ్యనగర కోకిల

ఈ కావ్యంలో భాగ్యనగర కోకిల, తోలుబొమ్మలాట, కర్షకోత్కర్షము, గాంధీ సంస్కృతి, రేడియో, అవ్వ, ఉచ్ఛిష్ట భారతము మొదలైన ఇరవై అయిదు శీర్షికలున్నాయి. వాటిలో మొదటిదానిపేరే కావ్యానికి పెట్టారు. ఇందలి ఖండికలు సంస్కృతి సంపన్నములూ- జాతీయ భావ సమంచితములూ అభ్యుదయాత్మకములూ. ఈ కృతి దౌహిత్రుడైన శ్రీకృష్ణునికి తాతగారి ఐహరాకృతి.

## జన్మభూమి

"జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ" అన్న మహాకవి మాట సువర్ణాల మూట. "కన్నతల్లి" "జన్మభూమి" స్వర్గంకంటె ఎన్నోరెట్లు గొప్పవే మరి. ఈ పరమసత్యం గ్రహించారు, కనుకనే నాయనివారు కన్నతల్లి మీది భక్తివిశ్వాసాలకు అనుగుణంగా "మాతృగీతాలు" అనే కన్నీటికావ్యం ఎప్పుడో నిర్మించారు. ఇక ఇప్పుడు తన జన్మభూమి అయిన పొదిలె ప్రాచీన

వైభవాన్ని ప్రదర్శించే ఈ ప్రౌఢకావ్యాన్ని అత్యంత సమర్థంగా అభిజ్ఞరసజ్ఞ మనోజ్ఞంగా రచించి దీనికి "జన్మభూమి" అనే సార్థకనామం ఉంచారు. జన్మభూమి కావ్యంలో అవతారిక, ప్రకృతి ఖండము, తటాఖండము, ధరణీధర ఖండము, శక్తి ఖండము, శివఖండము అనే ఆరువిభాగాలు ఉన్నాయి. దాదాపు 1200 పద్యాలు ఈ హృద్యమైనకావ్యంలో చోటుచేసికొన్నాయి. అవతారికలో నాయనివారి వంశచరిత్ర సహజ సుందరంగా వర్ణింపబడింది. ప్రకృతిఖండం ఒక అనల్ప శిల్పకళాఖండం. ఇందు పొదిలె పరిసరాలలోని ప్రకృతి సౌందర్యం అత్యంత మనోహరంగా అభివర్ణితమైంది. కొండలు, సెలయేళ్ళు, పైరుపొలాలు, రేగుపొదలు, తేళ్ళు, నేరేళ్ళు, వరిమళ్లు ఆకుతోటలు, అన్నీ కన్నులకు కట్టినట్లు చిత్రింపబడినాయి. తటాక ఖండంలో పెద్దచెరువు, చిన్నచెరువు, ముంగమూరి మహాజనుల విషాదగాథ, తాటితోపు మున్నగునవి వర్ణితములైనాయి. ధరణీ ధరఖండంలో పొదిలె కొండమీది లక్ష్మీనృసింహస్వామి అవతరణగాథ సంబురాయల చరిత్రతో కలిపి కమనీయంగా అభివర్ణింపబడింది. శక్తి ఖండంలో హృదయవిదారకమైన పొదిలెమ్మ కథ కరుణరసోజ్వలంగా సంతరింపబడింది. అంతేకాక పండితాఖండలుడైన పంచాగ్ని కథ, బ్రహ్మవిష్ణుమహేశ్వరుల కథ కూర్చబడినాయి. చిట్ట చివరిదైన శివ ఖండంలో స్థానిక దేవాలయాల స్థలమహత్వపు గాథలు, ఉద్దండ నృసింహభారతి కథ, నిమ్మవ్వకథ, నిర్మమేశ్వరుని అవిర్భావ వృత్తాంతము చక్కగా ఉదాహృతములైనాయి. స్థలమహత్వాన్ని, క్షేత్రప్రాశస్త్యాన్ని ప్రకటించే కల్పిత గాథలని హేతువాదులు మూతిముడవకుండా ఉంచే ఈ గాథలన్నిటినీ నాయనివారు కళాత్మకంగా కవితాసుందరంగా రసప్రసన్నంగా తీర్చిదిద్దారనటంలో అతిశయోక్తి లేదు.

నాయని యింత జాణ యగునా యని, తత్కృతు లింత లెస్సలౌ
నాయని, శబ్దముల్ కదలునా యని, భావము లాటకత్తెలౌ
నాయని, గుండియల్ పలుకునా యని, కావ్య రహస్యముల్ ఫలా
నాయని నే వచింప గలనా యని, అచ్చెరు వందితిన్ మదిన్.



Cover Printed at Nandini Art Printers, Hyd-29.